వెల
రు.2.50

# త్రివేణి

అక్టోబర
1985

3/10/8

సాంస్కృతిక మాసపత్రిక



గాంధీజయంతి విజయదశమి ప్రత్యేకసంచిక

శుభాకాంక్షలతో

Phones : Shop. 73467, 77052 Resi. 76986

100% టెరీన్ సూటింగులు, కంచిపట్టు చీరలతో!
అందమైన జీవితాన్ని పొందండి.



# లక్ష్మీసిల్కుహౌస్

కాంగ్రెస్ ఆఫీస్ రోడ్ • విజయవాడ 2

• విలువైన మా నగదు బహుమతులు పొందండి

...క్టోబరు - 1985

సంపుటి 1

సంచిక 10

సాంస్కృతిక మాసపత్రిక

సంపాదకుడు-కొమరగిరి క్రిష్ణమోహనరావు

మేనేజర్

కొమరగిరి చంద్రశేఖర్

24-51 రామానాయుడుపేట

మచిలీపట్నం-521 001

ఫోన్ : 2818

చందా వివరాలు

విడిప్రతి : రు. 2-50

సంవత్సర చందా : రు. 30-00

జీవిత సభ్యత్వం : రు. 500-00

EDITED, PRINTED & PUBLISHED BY

**Komaragiri Krishna Mohan Rao**

Printed at

SPANDANA PRINTERS
MACHILIPATNAM

విషయసూచిక



## శ్రీ సత్యసాయిబాబా

నవంబరు సంచిక శ్రీ సత్యసాయిబాబా ముఖచిత్రంతో వెలువడబోతున్నది. అభిమానులు ప్రకటనలిచ్చి ప్రోత్సహిస్తారని ఆశిస్తున్నాము.

సం

# అమృతవాణి

## మాచిభట్ల చంద్రశేఖరశర్మ

శ్లో॥ పరార్థే యః పీడా మనుభవతి, భంగేఽపి మధురో
యదీయః సర్వేషా మిహ ఖలు వికారోఽప్యభిమతః
న సంప్రాప్తో వృద్ధిం యది స భృశమక్షేత్ర పతితః
_ కిమిక్షోర్దోషోఽసౌ నపున రగుణాయా మరుభువః !

చెరకుగడ నెరగని వాళ్ళంటూ లేరు. పైగా అదంటే అందరికి మహా యిష్టం. దానివల్ల ప్రజలకు కావలసినంత వుపయోగముంది. అది లేనిదే నిత్యకృత్యం గడవదు. మధుమేహంతో బాధపడేవారు సామాన్యంగా దాని వూసెత్తుకోరు. కాని అలాంటి వారికికూడా నోరూరించి మనసులో మాధుర్యం నింపుతుంది. చిన్నవాళ్ళ దగ్గరనుంచి పెద్దవాళ్ళవరకూ దాన్ని ప్రేమిస్తారు. ఇంత చక్కని చెరకుగడ కథ యెలా వుందో చూడండి పాపం !

పరోపకారం చేయటమేకదా ! దాని లక్ష్యం ! అందుకోసమని అది అనుభవించే పీడ యింతా అంతా కాదు మరి. దానిలోంచి రసం పిండటంకోసం యంత్రాల్లో పడేసి చితక్కొడుతున్నారు. దయా దాక్షిణ్యం లేకుండా దాన్ని ముక్కలు ముక్కలు నరికి పారేస్తున్నారు. యంత్రాల్లో పడేసి నలిపేసినా ఖండ ఖండాలుగా నరికేసినా అది మాత్రం మధురంగానే వుంటోంది. ఇన్ని విధాల బాధిస్తున్నారు కదా అని అది తియ్యగా వుండటానికి బదులు చేదు నీయటం లేదు.

చెరుకు ముక్కలనుంచి రసం తీసి పెద్ద బానల్లోపోసి కింద మంట పెడుతున్నారు. వాళ్ల పెట్టే బాధకు మంటలకు ఆగలేక లోలోపల తుక తుక వుడికిపోయి పాపం చివరికి బిగుసుకుపోతోంది. దాన్ని బెల్లమని అంటూ రుచిగా తింటున్నారు. అలాగే యంత్రాల్లో దాన్ని నానా యాతనలు పెట్టి అణువులుగా చేసి దాన్ని పంచదార అని పిలుస్తూ ఆరగిస్తున్నారు.

ఇన్ని విధాల దాన్ని పీడించి దానికి ముక్కూ మొహం లేకుండా చేసి వికారంగా తయారు చేస్తున్నారు. అయినా అది మాత్రం అందరికి అభిమానాన్ని పంచిపెడుతున్నది. నన్నిలా రకరకాల రూపాల్లోకి మార్చి నన్ను వాడుకుంటున్నారే అని యే మాత్రం అనుకోదేమిటో చిత్రం ! పైగా తానింత బాధపడుతున్నా తననింత బాధపెడుతున్న వారికి కూడా ఆనందాన్నే కలిగిస్తోందంటే ఏం చెప్పాలి దాని విశేషం !

అలాంటి మంచి తీయని చెరకుగడ బ్రహ్మాండంగా పెరిగి పెద్దదయితే అందరికీ సంతోషంకాక యేముంది ? కాని ఒకొక్క ప్రదేశంలో పెరుగుదల లేక బలహీనమై పడివుందనుకోండి మనం ఏమంటాం దాన్ని చూచి ? ఒట్టి చచ్చుగడరా, పుచ్చుగడరా అని దాన్ని నిందిస్తాం. కొంచెం ఆలోచించండి – అది అలా చచ్చుగా వుండటానికి దోషం దానిదో కాదో.

అలా పెరగపోవటానికి గల దోషం చెరుకుగడది మాత్రం ఎన్నటికి కాదు. మరెవరిది ఆ దోషమంటారా ? ఆ దోషం సారంలేని భూమిది. అసలు అలాంటి నిస్సార

మైన భూమిమీద పడటమే ఆ చెరకు చేసుకొన్న పాపం. చెరకు ఎంత గొప్పదైనా అది చక్కగా పెరగటానికి యోగ్యమైన భూమి కావాలి. తనకు తగని క్షేత్రంలో పడినప్పుడు చెరకుగడకు అభివృద్ధి వుండదు. దాని అభివృద్ధి కావాలంటే సుక్షేత్రం కావాలి మరి.

ఇంతకూ చెరకు కథ వింటూంటే సత్పురుషుడు మదిలో మెదులుతున్నాడు. సజ్జనుడు తనను గుర్తించని చోట నున్నప్పుడు ఎవరికీ ప్రయోజనం లేదు. సత్సాంగత్యం కోరే జనం లేకపోతే సత్పురుషుడు ఒంటరివాడై పోతాడు. అయినా పరోపకారం చేయటానికే పాకులాడుతాడు. ఇతరులు తనెంత బాధిస్తున్నా బాధించే వాళ్ళమీద కోపానికి బదులు జాలి చూపిస్తాడు. చేతనైన సహాయం అడగకుండానే అందరికీ చేయటం అతని స్వభావం. దూషించినా పరుషంగా మాట్లాడడు. రకరకాలుగా అతనికి బాధలు కలిగిస్తున్నా సంఘానికి తనవల్ల ప్రయోజనం కలగాలని వుబలాటపడతాడు.

అలాంటి సజ్జనులను గుర్తించకపోతే ఎవరిదంటారు దోషం ? అతని కభ్యుదయం జరగకపోతే ఎవరిదంటారు తప్పు ?

ఆ దోషం ముమ్మాటికి అతడున్న ప్రదేశానిది. అంటే గ్రామానిది. లేకపోతే ఆ దేశాన్ని పాలించే ప్రభుత్వానిది. సంఘానిది.

సజ్జనులు హాయిగా అభివృద్ధి చెందాలంటే గుర్తించాల్సిన బాధ్యత స్థానిక సమాజానిది. యోగ్యులను పండితులను సమర్థులను గుర్తించకపోతే దేశానికే నష్టం కాని, వాళ్ళకు కాదు.

చెరకు పంటకు ఊషరక్షేత్రం సత్పురుషునికి అనుచిత ప్రదేశం అభ్యుదయ నిరోధకాలు.

# సంపాదకీయం

## ఆర్. టి. సి. బస్సులు ప్రయివేటు బస్సులు

ప్రయివేట్ కాంట్రాక్ట్ బస్సుల వలన ఆర్. టి. సి. కి తీరని నష్టం వాటిల్లుతున్నదని, ప్రయివేటు బస్సులు తిరగకుండా ప్రభుత్వం వెంటనే చర్యలను గైకొనాలనే వాదన ప్రతి సంవత్సరం అటు శాసనసభలోనూ, బయటా చర్చకు రావడం పరిపాటే అయింది. కొన్ని రాజకీయ పక్షాలకు జాతీయకరణ మీద మహామోజు. దానిని కాదంటే పెట్టుబడిదారుల ప్రతినిధులుగా చిత్రిస్తారేమోనని కొన్ని రాజకీయ పక్షాలకు భయం. జాతీయకరణ, సోషలిజం నినాదాలు అభ్యుదయవాదు లిచ్చేవని, వాటిని వ్యతిరేకించేవారు పచ్చి అభివృద్ధి నిరోధకులని కొన్ని రాజకీయ పక్షాలు ప్రచారం చేయడం జరుగుతున్నది. ఈ భయసందేహాలతో రాజకీయపార్టీలు, ప్రభుత్వం అసలు వాస్తవికతను గుర్తించడంలేదు.

ఆర్. టి. సి. కి నష్టం వస్తున్న మాట వాస్తవమే. నష్టాలను పూడ్చుకోవడానికోసం తరచుగా బస్సు చార్జీలు పెంచుతున్న మాట కూడా వాస్తవమే. ఆర్. టి. సి. వారికన్నా తక్కువ వసూలుచేస్తూ, ప్రయాణీకులకు మంచి సౌకర్యాలను (రేడియో, వీడియో, కుషన్‌సీట్లు వగయిరాలు) కలిపిస్తూ, సకాలంలో చేరవలసిన చోటికి చేరుస్తూ ప్రయివేటు బస్సులవారు లాభాలను ఆర్జిస్తున్న మాట కూడా వాస్తవమే. ప్రజలకు కావాల్సింది తక్కువ చార్జీ, ఎక్కువ సౌకర్యం. అది ఎవరు చూపిస్తే ఆ బస్సులలో ప్రజలు ప్రయాణం చేస్తారు. ఈ చిన్న విషయాన్ని అర్థం చేసుకొని ఆర్. టి. సి. ని మెరుగుపరచకుండా, ప్రయివేట్ బస్సుల వారిమీద ధ్వజమెత్తడం శోచనీయం. "ఆడలేక మద్దెల ఓటిది" అన్నట్లుగా వున్నది ప్రభుత్వవాదన. ప్రయివేటు బస్సులను తిరుగనివ్వం. మా బస్సులలో (ఆర్. టి సి) సౌకర్యాలున్నా లేక పోయినా, సకాలానికి వచ్చినా రాకపోయినా, చార్జీలు ఎక్కువ వసూలుచేసినా ప్రజలు మా బస్సులలోనే ప్రయాణం చేయాలనే వాదన ఏ మాత్రం నాగరికత అనిపించుకోదు. అభ్యుదయం అంతకన్నా కాదు. అసలు ప్రయివేటు బస్సులు తిరగడం వలననే అనేకమంది ప్రయాణీకులు సకాలమునకు గమ్యస్థానం చేరుకోగలుగుతున్నారు. ఒక్క ఆర్. టి. సి. వారిమీద ఆధారపడుతే లగ్నంవేళలు తప్పడం ఖాయం.

ప్రయివేట్ బస్సులు అనేకం "కాంట్రాక్ట్ టూరిస్టు లైసెన్సు" ల పేరుతో అనేక రూట్లలో తిరుగుతున్నాయి. వీరికి కొంతమంది రాజకీయ నాయకుల ఆశీస్సులు, మరి కొంతమంది అవినీతిపరులైన అధికారుల అండదండలు వున్నాయనే విషయం బహిరంగ సత్యం. ఇటువంటి టూరిస్టులమీద లీగల్‌గాగాని, టెక్నికల్‌గాగాని ఎవ్విధమైన చర్య తీసుకోవడం సాధ్యంకాదని ప్రభుత్వవాదన. ప్రభుత్వ ఖజానాకుకూడా రావలసినంత సొమ్ము రావడంలేదనే వాదనకూడా మరొకటి ఉన్నది.

ఏది ఏమైనా ఈ విషయంలో సమగ్రమైన పరిశీలన జరగాలి. ఆర్. టి. సి బస్సులతో సమానంగా ప్రయివేటు బస్సులుకూడా బహిరంగంగా తిరగడానికి ప్రతి రూటులో అనుమతించాలి. దానికి అవసరమైన పన్నును బహిరంగంగా వసూలుచేసి ప్రభుత్వఖజానాను పెంచుకోవాలి. వ్యాపారంలో పోటీ వుంటేనే వినిమయదారునికి లాభం, సౌకర్యం. పోటీ వుంటేనే నిర్వహణ బాగుంటుంది. ప్రజలకు ఎక్కువ సౌకర్యాలను చేయగలుగుతారు. నిర్వహణలో, బస్సులు బయలుదేరు వేళల విషయంలో ఎట్టి సంఘర్షణకు అవకాశం లేకుండా ప్రయివేట్ బస్సులవారు, ఆర్. టి. సి. వారు ఒక అంగీకారానికి వచ్చి సుహృద్భావంతో నడుపుకుంటే ప్రజలకు మేలుచేసిన వారవుతారు. ఎవరి నిర్వహణా సామర్థ్యం ఎంతటిదో ప్రజలకు కూడా బోధపడుతుంది.

గుత్తాధిపత్యం నియంతృత్వానికి దారితీస్తుంది. ప్రజలకు అసౌకర్యాన్ని పెంచుతుంది. పోటీ వ్యాపారం సమర్థతను పెంచుతుంది. ప్రజలకు న్యాయం చేకూరుస్తుంది. ఇది విస్మరించరాని నగ్నసత్యం.*

# లోకనాయక్ జయప్రకాష్

# సంపూర్ణ విప్లవం

' విప్లవం ' శబ్దం వినగానే ఇది ఒక హింసా పూరితమైన చర్య అనే అభిప్రాయం సహజంగా మనంద రిలో నాటుకొని పోయింది. అయితే లోకనాయక్ జయ ప్రకాష్ " సంపూర్ణ విప్లవం " దీనికి పూర్తి విరుద్ధం. ఒక పర్యాయం శ్రీ జె. పి. తన ఉపన్యాసంలో సంపూర్ణ విప్లవ లక్ష్యమును చక్కగ వివరించారు. " దయచేసి హింసను గురించి మాట్లాడటం ఆపండి. మాట్లాడటంలో కొంత సాహసం ఉండవచ్చుగాక. కాని అందులో దూర దృష్టి మాత్రంలేదు. అసలు నాకు హింసలో నమ్మకంలేదు. ప్రజాస్వామ్యంలో మాత్రమే నమ్మకం వుంది. ప్రజలలో నమ్మకం వుంది. ప్రజలలో నమ్మకం లేనివారు, ప్రజల విశ్వాసాన్ని పొందలేనటువంటివారు హింసలో దిగుతారు. ప్రజల శక్తి సంఘటితమైన చోట హింస అనవసరం. ప్రజలశక్తి సంఘటితం కానప్పుడు వచ్చే హింస చాలా క్రూరంగ వుంటుంది " అని లోకనాయక్ తన ఆవేదనను వెలిబుచ్చారు. దీనినిబట్టి శ్రీ జె. పి. కి ప్రజాశక్తిమీద ఎంతటి నమ్మకం వున్నదో బోధపడుతున్నది. అందువల ననే ఏ అధికారం లేకపోయినా, ఈ ఆత్మవిశ్వాసంతోనే ' ప్రజాశక్తి ' ని శ్రీ జె. పి. సమీకరించగలిగారు, నాయకులను ఒక త్రాటి మీద నడిపించగలిగారు.

## సప్త విప్లవాలు

సప్త రంగాలలో సంపూర్ణ విప్లవం రావాలని శ్రీ జె. పి. కోరుకున్నారు. సాంఘిక, ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక, విద్యా, నైతిక, ఆధ్యాత్మిక రంగాలలో మౌలికమైన మార్పులను తీసుకొని రావాలని తాపత్రయ పడ్డారు. ప్రతి పౌరునికి సంతృప్తికరమైన, సంతోషకర మైన " స్వేచ్ఛా " జీవితాన్ని గడుపుకునే అవకాశం లభించేటట్లు చేయాలని లోకనాయక్ అభిలషించారు.



1974 సం లో శ్రీ జయప్రకాశ్ విజయవాడ విచ్చేసినప్పుడు స్వాగతం చెబుతున్న శ్రీ కొమరగిరి కృష్ణమోహనరావు

## స్వేచ్ఛ

" స్వేచ్ఛ " ను గురించి ఒక పర్యాయం చక్కగ వివరించారు. " స్వేచ్ఛ అంటే మానవుని వ్యక్తిత్వమునకు స్వేచ్ఛ. మనస్సుకు స్వేచ్ఛ. భావమునకు స్వేచ్ఛఅని అర్థం అట్టి స్వేచ్ఛయే నా జీవితపరమావధి. నా జీవిత ఆకాంక్ష. అట్టి పవిత్రమైనదానిని రొట్టెకోసమో, అధికారంకోసమో, నా వ్యక్తిగత అభివృద్ధికోసమో, రాజ్య వైభవం కోసమో లేదా మరేవిధమైన నీతిబాహ్యమైన స్వార్థం కోసమైనా

సరే రాజీపడి దానిని త్యజించజాలను." అని లోకనాయక్ ఎంతో నిస్వార్థంగ తమ భావాలను వెలిబుచ్చారు. ఆయన జీవితంలో ఎన్నడూ అధికారంకోసం తాపత్రయ పడలేదు. ఎన్నికలలో పోటీ చేయలేదు. రాజకీయ అధికారాన్ని పొందాలనే ఆకాంక్ష వారికి ఎన్నడూ లేదు. అధికారం లేకపోయినా ప్రజల సహకారానికి మాత్రం కొదవలేదు. అధికారాన్ని పొందినవారికన్నా, యినుమిక్కిలిగా ప్రజల మన్ననలను పొందిన ఏకైక నాయకుడు లోకనాయక్ జయప్రకాష్ మాత్రమే అనడంలో ఏ మాత్రం అతిశయోక్తి లేదు. స్వాతంత్ర్య సంగ్రామ సమయంలో మహాత్మాగాంధీజీ ప్రజానాయకుడైతే, స్వాతంత్ర్యానంతరం, అదే స్థితి నందుకొవిన ప్రజానాయకుడు శ్రీ జయప్రకాశ్‌నారాయణ మాత్రమే.

## త్యాగం

శ్రీ జె. పి. బీహార్ ఉద్యమ సందర్భంలో పాట్నాలోని గాంధీ మైదాన్‌లో ప్రసంగిస్తూ "విప్లవాత్మకమైన ఆలోచనలు, వాటిని ఆచరించడం సులభం కాదు, ఆచరించాలంటే త్యాగాలు చేయాలి. నేడు చాలామంది త్యాగం చేయకుండా నాయకులవ్వాలనుకుంటున్నారు. కష్టాలు సహించాలి. లాఠీ దెబ్బలు తినాలి. తుపాకి గుండ్లకు ఎదురు నిల్వాలి. జైళ్ళను నింపాలి? వట్టి నినాదాలతో ప్రయోజనం శూన్యం. స్వరాజ్యం సంపాదించడానికి వేలు, లక్షలమంది యువకులు త్యాగాలు చేశారు. ఉరికంబాల కెక్కారు. లక్షలాది మంది ప్రజలు పలు పర్యాయములు జైళ్ళకు వెళ్లారు. ఒక్క రాజకీయ స్వాతంత్ర్యం మాత్రం మనకు లభించింది. సాంఘికన్యాయం చేకూరలేదు. అవినీతి విశృంఖలంగా విలయతాండవం చేస్తున్నది. ఆర్థిక పరిస్థితి మెరుగు పడలేదు. నిరుద్యోగ దేవతకు ఎంతోమంది యువకులు బలైపోతున్నారు. సాంఘిక దురాచారాలు పెచ్చు పెరిగిపోతున్నాయి. నైతిక విలువలు దిగజారిపోతున్నాయి. ఆధ్యాత్మిక విలువలు అంతరించి పోతున్నాయి. విద్యావిధానంలో ఏ మార్పులు రాలేదు. వీటన్నిటి కోసం అన్ని రంగాలలో విప్లవాత్మకమైన మార్పును తీసుకొని రావడమే నా "సంపూర్ణ విప్లవ లక్ష్యం." అన్నిరకాల అన్యాయాలకు ప్రజలు గురి అవుతున్నారు. బానిస విద్య, కలం అరిగే చదువు యిప్పటికీ యివ్వబడుతున్నది. విద్య సంపాదించి ఉద్యోగాల కొరకు అగచాట్లు పడవలసివస్తున్నది. యువకుల భవిష్యత్తు అంధకారంలో వున్నది. ఒక్క రాజకీయ స్వాతంత్ర్యం కోసమే లక్షలాదిమంది యువకులు త్యాగం చేయవలసివస్తే, ఇన్ని దురాచారాలను ఎదుర్కొని విప్లవాత్మకమైన మార్పులు గైకొని రావడానికి ఎందరో త్యాగాలు చేయవలసివస్తుంది. గతంలో చేసిన త్యాగాలవలన మనంఇప్పుడు రాజకీయ స్వాతంత్ర్యమును అనుభవిస్తున్నాం. మన త్యాగాలవలన భవిష్యత్తరాలవారు సుఖపడుతారు." అని లోకనాయక్ ఎలుగెత్తి చాటారు. ఉత్సాహమైన, ఉద్రేకపూరితమైన ఉపన్యాసం చేశారు. ఎంతోమంది యువకులు ఆకర్షించబడ్డారు. బీహారులో కనీ వినీ ఎరుగని ఉద్యమం లోకనాయక్ నేతృత్వంలో జరిగింది. బీహారు ఉద్యమం భారతదేశంలోని మిగతా రాష్ట్రములవారికి స్ఫూర్తినిచ్చింది. అది భారత రాజకీయ చరిత్రను తారుమారు చేసింది. ఈ ఉద్యమం స్వాతంత్ర్యోద్యమమును సహితం మైమరిపించింది.

## జే. పి. జీవితం

లోకనాయక్ శ్రీ జయప్రకాశ్‌నారాయణ 1902 సం. అక్టోబరు 11 వ తేదిన బీహార్ రాష్ట్రంలో "సీతాబడేరా" గ్రామంలో జన్మించారు. వీరి తండ్రిపేరు హర్షూదయాళ్. వీరు బీహార్ ప్రభుత్వంలో కెనాల్ డిపార్టుమెంటు రెవిన్యూ ఉద్యోగిగా పనిచేశారు. జయప్రకాశ్ విద్యాభ్యాసం పాట్నాలో వారి మేనమామగారి ఇంట్లో జరిగింది. ప్రముఖ న్యాయవాది మరియు కాంగ్రెసు నాయకులైన బ్రిజ్‌కిషోర్‌గారి రెండవ కుమార్తె ప్రభావతితో వివాహం జరిగింది. 1920 లో పాట్నాలో చేసిన గాంధీజి ఉపన్యాసం విని జయప్రకాశ్ ముగ్ధులయ్యారు. ఇంటర్ ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణులయ్యారు. ఇంగ్లండ్ వెళ్ళి పై చదువులు చదవమని కుటుంబ పెద్దలు సలహా యివ్వగ,

ఏ దేశమైతే మనల్ని పీడించి పరిపాలిస్తూ, బానిసలుగ చూస్తున్నదో, అట్టి బ్రిటీష్‌దేశమునకు వెళ్ళి చదువుటకు శ్రీ జె. పి. యిష్టపడలేదు. 1922 సం. అక్టోబరు 8 వ తేదిన శాన్‌ఫ్రాన్సిస్కో చేరెను. చికాగో విశ్వవిద్యాలయంలో ఎమ్. ఏ చదువుతూ "సాంఘిక వ్యవస్థ-దాని పరిణామాలు" మరియు "సాంఘికన్యాయం" అన్న విషయాలపై అనేక వ్యాసాలు వ్రాసి పెద్దల మెప్పును పొందారు. పిహెచ్. డి చదువుతుండగ తల్లి జబ్బు వార్త విని 1929 నవంబరులో భారతదేశం వచ్చారు. అమెరికాలో ద్రాక్షతోటలలో పనిచేసి సంపాదించి ఎంతో కష్టపడి చదువుకున్నారు. అమెరికాలో వుండంగ మార్క్సిస్టు తత్వమునకు ప్రభావితులయినారు. జయప్రకాశ్ స్వదేశమునకు వచ్చిన వెంటనే పాశ్చాత్య వేష ధారణను విడనాడి మనదేశ సాంప్రదాయం ప్రకారం చొక్కా ధోవతి ధరించ నారంభించెను. శ్రీ జయప్రకాశ్ అమెరికాలో చదువుతున్న 7 సం. లు వీరి భార్య ప్రభావతి దేవి గాంధీజి ఆశ్రమంలో వుండి కస్తూరీబాతో ఉద్యమాలలో పాల్గొనేది. 1929 లాహోర్ కాంగ్రెసు తరువాత శ్రీ నెహ్రూ జయప్రకాశ్‌ను అఖిలభారత జాతీయ కాంగ్రెసుకు ప్రధాన కార్యదర్శిగా నియమించారు. 1932 జనవరి 4 న కాంగ్రెసును నిషేదించారు. శ్రీ జె పి. మద్రాసులో 1932 సెప్టెంబరు 7 వ తేదిన అరెస్టు అయినారు. నాసిక్ జైలులో వుంచారు. 1934 జనవరి 15 వ తేదిన విడుదల అయ్యారు. మిత్రులతో కలిసి 1934 మే 17 వ తేదిన కాంగ్రెసు సోషలిస్టు పార్టీని స్థాపించారు. 1936 లో వీరు రచించిన "సోషలిజం దేనికి." అనే గ్రంథం వీరికి మంచి పేరును తెచ్చిపెట్టింది.

## కారాగారం

1939 లో జంషెడ్‌పూర్ కర్మాగారంలో కార్మికుల నుద్దేశించి ఉపన్యసించినందుకు జె. పి. ని అరెస్టుచేసి నాసిక్ జైలుకు పంపారు. 1940 లో హజారాబాద్ జైలుకు మారారు. విడుదల అయిన తరువాత రహస్య జీవితమునకు వెళ్ళిరి. గాంధీజీ ప్రారంభించిన వ్యక్తి సత్యాగ్రహంలో మొదటి వారుగ జయప్రకాశ్, వినోబాభావేలను ఎన్నుకొనిరి. ఆ సందర్భంగా అరెస్టుచేసి సంవత్సరంపాటు లాహోర్ జైలులో వుంచారు. విడుదల అయిన తరువాత మళ్ళీ రహస్య జీవితంలోనికి వెళ్ళారు – తరువాత పోలీసులు వారిని అరెస్టుచేసి "డిటెన్యూ" గా "దివోలి" జయిలుకు పంపారు. వీరు ప్రమాదకరమైన వ్యక్తి అని ప్రభుత్వం భావించి వీరిని "హజారాబాద్" జైలుకు మార్చారు. ఆ జైలు గోడలు 17 అ. ఎత్తు ఉంటాయి. బయట బ్రహ్మాండమైన ఉద్యమం ప్రారంభమైనది. వీరు జైలులో వుండలేక ఏదో విధంగా బయటపడాలని పథకం రూపొందించుకున్నారు.

## జైలునుండి పరారి

ఆది 1942 నవంబరు 9 వ తేది. దీపావళి పండుగ వేడుకలను ఖైదీలు జరుపుకుంటున్నారు. పోలీసులు, ఖైదీలు వారి వేడుకలలో నిమగ్నులైనారు. అంతకు పూర్వమే తయారుచేసుకొనిన పథకం ప్రకారం జయప్రకాశ్‌తోసహా అరుగురు డిటెన్యూలు చీకటిలో ప్రహరీ గోడమూలకు చేరుకున్నారు. కాపలాకాయు జమాన్ డ్యూటీ అయిపోయి వెళ్ళిన వెంటనే సర్కస్‌లో మాదిరి ఒకరి భుజాలమీద ఒకరు ఎక్కి పైవాడు ప్రహరీగోడ ఎక్కాడు. ధోవతులను తాళ్ళలా ఉపయోగించుకొని అందరూ ఆరు నిముషాలలో ప్రహరీగోడ ఎక్కి బయటకు దుమికి వెళ్లారు. 8 నిముషాలనంతరం క్రొత్తగా వచ్చిన జమాన్ డ్యూటీలో చేరాడు. ఆ అరణ్య ప్రాంతాలలో రోజుల తరబడి రెండు గ్రూపులుగ నడిచారు. జయప్రకాశ్ నడుము నొప్పితో బాధ పడుతూ కూడా నిర్విరామంగా నడిచి మామగారింటికి చేరారు. మరొక గ్రూప్‌వారు ఉత్తరప్రదేశ్ చేరుకున్నారు. జయప్రకాశ్ ఆచూకీని చెప్పినవారికి రు. 10 వేలు బహుమతి యిస్తామని ప్రభుత్వం ప్రకటించింది.

## మారువేషం

శ్రీ జయప్రకాశ్ 10 నెలలకాలంపాటు మారువేషంలో దేశం మొత్తం పర్యటించి కార్యకర్తలను సమీపించారు. 1943 సెప్టెంబర్ 19 వ తేదిన లాహోర్ వెళ్ళే రైలులో అమృతసర్‌లో ఎక్కారు. పోలీసులు వారి ఆచూకి గమనించి అదే పెట్టెలో ఎక్కి రివాల్వర్ చూపించి వారిని అరెస్టు చేసి ఆగ్రా జైలులో పెట్టారు. 1946 ఏప్రియల్ 11 వ తేదిన విడుదల అయినారు. లాహోర్ జయిలులో వీరిని ఒంటరిగా ప్రత్యేకంగా ఒక గదిలో ఉంచారు. బ్రిటీషువారు ప్రచురించిన రెండు ఆంగ్ల పత్రికలను సెన్సారుచేసి వీరికి యిచ్చేవారు. బాహ్యప్రపంచ సమాచారం ఏ మాత్రం తెలియకుండా చేశారు. వారి చేతులకు సంకెళ్ళు వేసి వుంచేవారు. ఉదయం ఒక గంట కాలం మాత్రం వ్యాయామం చేసుకోవడానికి అవకాశం మాత్రం యిచ్చేవారు. ఆగ్రా జైలు నుంచి విడుదలై పాట్నా చేరే వరకు ప్రతి రైలుస్టేషన్‌లో ప్రజలు ఘన స్వాగతం యిచ్చారు. అనాడు పండిత నెహ్రూ తరువాత పేరున్న నాయకుడు జయప్రకాష్ అనే అభిప్రాయం సర్వే సర్వత్రా వ్యాపించింది. జయప్రకాశ్ దీర్ఘకాలం అజ్ఞాతవాసంలోను, జైలులోను గడపడం వలన ప్రజలు ఆయన మీద ఎన్నో ఆశలు పెట్టుకున్నారు.

## భూదాన ఉద్యమం

1948 జనవరి అఖరులో జయప్రకాశ్ గాంధీజీని కలుసుకొని సోషలిస్టులు యింకా అధిక కాలం కాంగ్రేసులో వుండజాలరని ఖచ్చితంగా చెప్పారు. 1951లో వినోబాభావేతో చేరి పూర్తిగ భూదాన ఉద్యమానికి అంకితమైనారు. దాదాపు ఒక లక్ష ఎకరముల భూమిని దానంగా స్వీకరించారు. 1954లో బుద్ధగయలో జరిగిన సర్వోదయ మహా సభలలో వారు జీవాసందునిగ మారినానని తెలియజేశారు: ఎవరైతే వారి జీవితమును ఒక ధ్యేయమునకు అంకితం చొనర్చుదురో, అట్టివారు ఆ పేరుతో పిలువబడుదురు. వారా ప్రకటన చేయగానే 600 మంది యువకులైన స్త్రీ పురుషులు వారి ననుసరించారు. జయప్రకాశ్ నెహ్రూ ఆహ్వానమును అంగీకరించి కేంద్ర మంత్రివర్గంలో చేరి వుండినట్లయితే నెహ్రూ తరువాత భారత ప్రధాని అయివుండేవారు. జీవితం చాలా విచిత్రమైనది. ప్రభుత్వాధినేత కావలసిన మహానుభావుడు బుద్ధునివలె పరివ్రాజక జీవితమును స్వీకరించిన మహాయోగి లోకనాయక్. సోషలిజం నుండి సర్వోదయం వరకు ప్రయాణం చేసిన సర్వసంగ పరిత్యాగి.

## మహాప్రదర్శన

1973 డిశంబరులో భారత పార్లమెంటు సభ్యులందరికి ప్రాథమిక హక్కులు, న్యాయస్థానముల స్వేచ్ఛలను గురించి, మరియు రాజకీయరంగంలో అవినీతిని పేర్కొంటు సుదీర్ఘమైన ఉత్తరం వ్రాశారు. 1974లో బీహర్ ఉద్యమం వీరి నేతృత్వంలో తారస్థాయినందుకున్నది - 1975 మార్చి 16 న పార్లమెంటు భవనంముందు వీరి నాయకత్వాన 10 లక్షలమంది ప్రజలతో మహాప్రదర్శన జరిగింది. బీహరు ఉద్యమానికి పూర్వమే వీరి సతీమణి ప్రభావతీదేవి 1973 ఏప్రియల్ 15 వ తేదీన పరమపదించింది. ఆమె లేకుండా కాలం గడపడం వీరికి కష్టమైంది. ఆ లోటును భర్తీ చేసుకొనుటకా ! అన్నట్లుగ విరామమెరుగని ప్రజాఉద్యమంలో దిగిపోయారు.

## జె. పి. నిర్యాణం

జయప్రకాశ్ ఆరోగ్యం మాత్రం క్షీణిస్తూ వచ్చింది. వైద్యుల ప్రయత్నాలు సఫలం కాలేదు. 1979 సం అక్టోబరు 8 వ తేది ఉ. 5. 45 నిముషములకు ఆ మహనీయుడు శాశ్వతంగా కన్ను మూయడం జరిగింది. యావత్ ప్రపంచం శోక సముద్రంలో మునిగిపోయింది. భారత్‌కు స్వాతంత్ర్యం తెచ్చిన ఘనత మహాత్మా గాంధీజీకి దక్కితే, స్వేచ్ఛా స్వాతంత్ర్యములు మృగ్యమవుతున్న తరుణంలో తిరిగి భారత్ కు స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను ప్రసాదించిన ఘనత శ్రీ జయప్రకాశ్‌కు దక్కింది. నిజంగా వీరిద్దరూ అధికార పదవులను ఏ మాత్రం కాంక్షించని నిస్వార్థ సేవాపరాయణులు. ఒకరికి స్వాతంత్ర్యం తెచ్చిన ఘనత దక్కితే, మరొకరికి స్వాతంత్ర్యం నిలబెట్టిన ఘనత దక్కింది. వారికి మన కృతజ్ఞతాభివందనలు.

కొమరగిరి కృష్ణమోహనరావు

# ఓ నిరుద్యోగమా!

## పచ్చటి పొలాల్లోంచి పోతున్న ఆ రైలులో కిటికీ దగ్గర కూర్చున్న నేను ఆ పైరునీ, ప్రకృతిని చూస్తున్నాను.

నా మనసు చాలా ఆనందంగా ఉన్నది. ఆ ప్రకృతి సౌందర్యాన్ని చూసి పరవశించి ఆనందిస్తున్నాను అని అనుకుంటే మీరు పొరబడినట్లే లెఖ్క. నేను ఆలోచించేదీ, ఆనందించేదీ చాలాకాలం తరువాత కలుసుకోబోయే నా మిత్రుడు శర్మ గురించి. నేను కలకత్తా వచ్చిన నాలుగేళ్ళలోను వాడ్ని చూడలేదు.

మొదట రెండు సంవత్సరాలు వాడి దగ్గర్నుంచి letters వచ్చినాయి. ఆ తరువాత నేను ఇల్లు మారటం వల్లా, నాకు ఉత్తరాలు రాయటం బద్ధకం అవటంవల్లా వాడి letters అందలేదు. చివరికి నెలరోజుల క్రితం ఒక letter వచ్చింది వాడి దగ్గర్నుంచి. నా అడ్రస్ మా అమ్మావాళ్ళ దగ్గర్నుంచి తీసుకున్నాడట. వాడికి ఉద్యోగం వచ్చి సంవత్సరమైందనీ, పెళ్ళయి ఆర్నెల్లయిందనీ వ్రాశాడు. వాడు ఇంట్లో ఎదిరించి కులాంతర వివాహం చేసుకొనడం వల్ల, అందులో ఎవరికీ చెప్పకుండా పెళ్ళి చేసుకోవటం వల్ల నాకు తెలియపరచలేదనీ వ్రాశాడు. తను విజయవాడలోనే ఉంటున్నాననీ, నన్ను రమ్మని వ్రాశాడు. అందుకే ఈ ప్రయాణం. వాడ్ని చూసి చాలాకాలమైందనీ, అమ్మా, నాన్నా వాళ్ళను చూడొచ్చనీ బయలుదేరాను. నేను వాడు కలిసి చేసిన అల్లరి పనులు, సాహసకృత్యాలూ తలచుకుంటూ నాకు తెలియకుండానే నిద్రలోకి వెళ్ళిపోయాను.

"ఒరేయ్" అని పిలుస్తూ ఎవరో గట్టిగా తట్టి లేపుతూంటే నాకు మెలకువ వచ్చింది. నేను కళ్ళు తెరవగానే

"అమ్మయ్య ఇప్పటికైనా లేచావుకదా! నేను లేపకపోతే మద్రాసులో తేలేవాడివి; ఇంకానయం" అంటూ సన్నగా, కళ్ళద్దాలతో ఉన్న ఒక వ్యక్తి నన్ను లేపుతున్నాడు. తీరా చూస్తే ఇంకెవరూ శర్మగాడే. ఫుల్ హాండ్స్ షర్ట్, బెల్‌బాటమ్ పాంటూ, షూస్ వాడూ. నాకెంతో సంతోషం వేసింది, వాడు స్టేషనుకు వచ్చి నన్ను రిసీవ్ చేసుకున్నందుకు. ఆ కబురూ, ఈ కబురూ చెప్తూ స్టేషన్ బయటకు వచ్చాం. వాడి జోక్స్ అవీ, వాడేం మారలేదు. ఆఫ్‌కోర్సు రూపంలో మారాడు లెండి. రిక్షాలో వాడి ఇంటికి వెళ్ళాం. గుమ్మంలోనే ఒకామె ఎదురైంది.

"మా ఆవిడ వసుంధర" అని పరిచయం చేశాడు వాడు. ప్రతినమస్కారాలయ్యాక లోపలికి వెళ్ళాం. "స్నానానికి నీళ్ళు తోడాను రారా" అని వాడు పిలవ

టంతో పరిసరాలు గమనిస్తున్న నేను స్నానానికెళ్లా. స్నానంచేసి ఫ్రెష్‌గా కూర్చొని టిఫిన్ చేస్తున్నాం. వాడు వాడి ధోరణిలో జోక్స్ వేస్తున్నాడు, కబుర్లు చెప్తున్నాడు. "నువ్వేం మారలేదురా కిరణ్, నీ మొహమాటం బిడియం ఏమీ పోలేదు. ఎలా వుంటున్నావురా ఆ కలకత్తా మహానగరంలో" అని చనువుగా మందలించాడు వాడు. నిజమే! నాకు మొహమాటం ఎక్కువే. చేసేది ఆఫీసరు ఉద్యోగం అవటం వల్ల నాకు జవాన్లుండటం వల్లా నాకు అంత అవసరం రాలేదు. వాడు ఇంట్లో కూడా పాదాలను కవర్ చేసే బూట్లు లాంటివి వేసుకుంటున్నాడు. వాడిఇంట్లో ఇదివరకు చెప్పులతో తిరగటం నిషిద్ధం (వాడి నాన్నగారి హయాంలో అనుకోండి.) హయాం మారింది కదా! మార్పు సహజమే అని సరిపెట్టుకున్నా.

మాటల మధ్యలో వాడు "ఒరేయ్ నీ కోసం పది రోజులు నేను లీవ్ పెట్టా. అట్లా అని పదిరోజుల్లో పోతానంటే వీల్లేదు. నేనుండమన్నంతకాలం ఉండా ల్సిందే" అన్నాడు. నా ప్లాను ప్రకారం కొన్ని రోజు లిక్కడ వుండి అమ్మా నాన్నలను చూడటానికి నిమ్మలూరు వెళ్ళాలి. అదే వాడికి చెప్పాను. వాడు అందుకు ఒప్పు కున్నాడు.

కబుర్లలో వాడు చెప్పాడు. మూడు సంవత్సరాలపాటు నిరుద్యోగంతో పాట్లు పడ్డాడట, సంవత్సరం క్రితం ఉద్యోగం దొరికిందనీ చెప్పాడు. మంచి ఉద్యోగమే వాడిది. నెలకు రెండువేలొస్తాయి. తరువాత వాడు పెళ్ళిచేసుకున్నా డనీ చెప్పాడు. అదీ ఇదీ చెప్పి 'నీ పెళ్ళెప్పుడు చేసుకుంటా వురా' అని అడిగాడు. నేనొక నవ్వు నవ్వాను. ఆ నవ్వుకు అర్థం వాడికి తెలుసు. అప్పుడు చెప్పాడు వాడు పూర్ణిమ ఇంకెవరినో పెళ్ళి చేసుకుందని.

పూర్ణిమ ఎవరని మీరడిగితే మేము పి. జి చదువుతున్న రోజుల్లో మా క్లాస్‌మేట్. నాతో చాలా చనువుగా తిరిగేది. సినిమాలూ, షికార్లూ కలిసి వెళ్ళేవాళ్ళం. చివరకు నేనే ధైర్యంచేసి మనసులోని మాట చెప్పాను, కానీ ఆమె అందుకు తిరస్కరించి తనెప్పుడూ ఆ దృష్టితో చూడలేదనీ అంది. అంతే నేను హతాశుడ్నయి పోయాను. నిజమే తనకా ఉద్దేశం ఉండకపోవచ్చు అని సరిపెట్టుకున్నాను. కానీ నేను సరిపెట్టుకున్నంతగా నా మనసు సరిపడలేక పోయింది. అందుకే కాలంగడిచినా నేను బ్రహ్మచారిగానే ఉండిపోయాను.

సరదాగా పదిరోజులూ పది నిమిషాల్లా గడిచిపోయినాయి. నేను అమ్మా నాన్నల దగ్గరకు వెళ్ళే రోజు వచ్చింది. నేను వెళ్తానని చెప్పాను. తిరుగు ప్రయాణంలో మళ్ళీ రమ్మని ఆహ్వానించారు- వాళ్లు. ఈ పదిరోజుల్లోనూ నా కీన్ అబ్జర్వేషన్‌లో గమనించిందేంటంటే వాడు పాదాలను కవర్‌చేసే చెప్పులే ఇంట్లో వేసుకుంటున్నాడు. బయట షూస్ కంపల్సరీ. వాడు చదువుకునే రోజుల్లో షూస్ లైక్ చేసేవాడు కాదు.

నే వెళ్తుంటే బస్‌స్టాండుకొచ్చాడు వాడు, బస్సు బయలు దేరటానికి పావుగంట టైముంది. చివరికి ఆపుకోలేక అడిగేశాను వాడ్ని "ఏరా ఏంటీ బూట్లమీద మోజు పుట్టిందా? వదలకుండా వేసుకుంటున్నావు" అని నవ్వాను. వాడూ నవ్వాడు కానీ వాడి నవ్వులో సహజత్వం లోపించింది. అప్పుడు వాడి ఎడమకాలి బూట్, సాక్స్ తీశాడు. వాడి ఎడమకాలికి చిటికినవేలు లేదు. "మూడు సంవత్సరాలు నిరుద్యోగంతో పాట్లుపడి ఉద్యోగం రాక చివరకు వేలు కోసుకున్నానురా! ఫిజికల్లీ హేండీకాప్డ్ క్రింద ఉద్యోగం వచ్చింది" అంటూ చెప్పుకుపోతు న్నాడు వాడు.

నా కళ్ళముందున్న లోకం గిఱ్ఱున తిరుగసాగింది. ఆహా! స్వతంత్ర భారతదేశంలో నిరుద్యోగం ఒక మనిషిని ఇంతగా దిగజారుస్తుందా అని నా కనిపించింది. బస్సు రొద చేసుకుంటూ బయలుదేరింది.

— శివకాశి

# మహోన్నత మానవతావాది, ఆధ్యాత్మిక తత్త్వవేత్త

# మహాత్మా గాంధీజీ

అక్టోబరు 2వ తేది గాంధీ జయంతి. ఆ మహనీయుని జీవితచరిత్రను గురించి వ్రాయవలసిన అవసరంలేదు. ఒక్క భారతీయులకేగాక ప్రపంచ ప్రజానీకానికి యావన్మందికి ఆయన ఉజ్జ్వల జీవితచరిత్ర బాగా తెలుసు. ముఖ్యంగా మనదేశంలో మహాత్మాగాంధీజీ వారసులమని చెప్పుకుంటూ రాజకీయంగా చలామణి అవుతున్న నాయకులూ వున్నారు. ఆ మహనీయుని ఆదర్శాలను ఆచరిస్తూ ఎట్టి పటాటోపం లేకుండా జీవనయాత్ర కొనసాగిస్తున్న అనుచరులూవున్నారు. వారి సందేశాలను ప్రచారంచేస్తూ సంతృప్తిచెందే తాత్వికవేత్తలూవున్నారు. చిట్టచివరికి ఆయనకు వారసులమని చెప్పుకుంటూ, గాంధీటోపీని ధరించి ప్రజలను వంచనచేస్తున్న కొంతమంది స్వార్థపరులూ వున్నారు. అందరికీ ఆ మహనీయుడు ఆరాధ్యదేవతే. అట్టి యుగకర్త యొక్క సందేశాలలో కొన్నింటిని వెలుగులోనికి తీసుకునిరావాలనే సంకల్పంతో ఈ వ్యాసరచనకు సంకల్పించుకున్నాను.



## భారతదేశం

భారతదేశాన్ని గాంధీజీ ఎన్నడూ ఒక భోగభూమిగా భావించియుండలేదు. ఈ దేశాన్ని ప్రధానంగా కర్మభూమిగా, ధర్మభూమిగా, తపోభూమిగా, త్యాగభూమిగా గాంధీజీ చూచారు. ప్రపంచంలో ధార్మిక నేతృత్వానికి (Religious Supremacy) పూర్తిగా తగివున్నది ఒక్క భారతదేశమేనని, భారతదేశానికి నశింపులేని ఒక ఆత్మ ఉన్నదని; ఆ ఆత్మ శారీరక బలహీనతలన్నిటిపైన విజయం సాధించగలదని, ప్రపంచమంతటియొక్క భౌతిక సమీకరణను భారత్ ఎదిరించి నిలువగలదని గాంధీజీ సంపూర్ణ విశ్వాసం.

## మతం

గాంధీజీ దృష్టిలో మతం సర్వోత్కృష్టమైనది. వారి మాటలలో సమాజంనుండి మతమును నిర్మూలించ యత్నించడం వ్యర్థప్రయాస. అట్టి ప్రయత్నం ఫలిస్తే సమాజమే నాశనమవుతుంది. మూఢనమ్మకాలు, దురాచారాలు, ఇతర లోపాలు ప్రతియుగంలోను మతంలో ప్రవేశించి దానిని తాత్కాలికంగా కలుషితం చేస్తాయి. అవి వస్తాయి, పోతాయి. కాని మతం మాత్రం మిగులుతుంది. ఎందువల్లనంటే విస్తృతమైన అర్థంలో ప్రపంచము యొక్క అస్తిత్వం మతంపై ఆధారపడివుంది. మతం యొక్క నిర్వచనం దైవశాసనానికి బద్ధులై ఉండటం. భగవానుడు, అతని శాసనం–రెండూ ఒకటే.

## భగవంతుడు

భగవంతుడంటే గాంధీజీకి అకుంఠిత విశ్వాసం. గాంధీజీ దృష్టిలో భగవంతుడెక్కడో లేడు. మానవ హృదయాలలో నివసిస్తున్నాడు. మానవునిలో మంచి చేయమని ప్రోత్సహించే అంతరాత్మే భగవంతుడని గాంధీజీ విశ్వాసం. "ఈశ్వరునిలో విశ్వాసంలేని వ్యక్తి సముద్ర కెరటమునుండి బయటపడిన నీటిబిందువువలె నశించును" అని గాంధీజీ చెప్పేవారు. ధార్మిక సిద్ధాంతాలలో నమ్మకం లేకపోతే పరిపూర్ణమైన జీవితం సాధ్యంకాదని గాంధీజీ నమ్మకం. తాను భగవంతుని హస్తాలలో ఒక చిన్న పరికరం మాత్రమేనని, ఆ పరికరాన్ని ఏ విధంగా, ఎంత వరకూ ఉపయోగించాలో ఈశ్వరునికి బాగా తెలుసునని గాంధీజీ నమ్మకం.

౧

గాంధీజీకి భగవద్గీత సాక్షాత్ దైవము. అది ఆయనకు ఆరాధ్యం, శిరోధార్యం. వారి మాటలలో "సంశయములు నన్నావరించినప్పుడు, సంకటములు సంప్రాప్తమైనప్పుడు, నిరాశా నిరుత్సాహములు జనించినప్పుడు నేను భగద్గీతను తెఱచి చూచుదును. అందు ఏదో ఒక శ్లోకము నన్నూరడించును. తత్ఫలితముగ మహావిపత్కర పరిస్థితియందు గూడ నా ముఖముపై చిఱునవ్వు తాండవించుచుండును". అని చెప్పిన వారి మాటలనుబట్టి భగవద్గీత యెడల వారికి వున్న భక్తి, విశ్వాసం ఎట్టిదో అవగతమవుతుంది.

## సత్యం, అహింస

గాంధీజీ ప్రబోధించిన మహోన్నత సూత్రాలు సత్యం అహింసలు. "సత్యం విస్మరించి స్వేచ్ఛ సాధించడం కన్న దేశం నాశనమయిపోయినా నేను విచారించను" అని పలికిన గాంధీజీ పలుకులు అర్థం చేసుకుంటే సత్యం యెడల ఎంతటి గౌరవం గాంధీజీకి కలదో అర్థమవుతుంది. గాంధీజీ దృష్టిలో అహింస అంటే ఎవరికీ అపకారం చేయకపోవడం మాత్రమేకాదు. అహింస ఒక మహాశక్తి. ప్రేమ అన్న విశ్వమానవ సిద్ధాంతసారం. వ్యక్తులకి కానివ్వండి, దేశాలకి కానివ్వండి, విమోచన సాధించాలంటే అహింసామార్గం అనుసరించాలి: ఆ మార్గం ఋషులకు, యోగులకు మాత్రమే ఆదేశించిన సూత్రం కాదని గాంధీజీ విశ్వాసం. "సత్యం, అహింస అవిభాజ్యములు. అవి నాణెపు రెండు ముఖములవంటివి. సత్యం అన్వేషించే వ్యక్తి తప్పనిసరిగా అహింసా పథము తొక్కక తప్పదు. అలాగే సత్యం అనుసరించనినాడు అహింస సాధ్య పడదు. అందుచేత ప్రతి వ్యక్తి మనలో అంతర్గతమై ఉన్న అహింసా విధానాన్ని అనుసరించి ఆ పరమ సత్యాన్ని అన్వేషించాలి" అని గాంధీజీ ప్రబోధించారు. గాంధీజీ దోపిడీకి అవకాశం లేని సమతాయుత సామాజిక వ్యవస్థ ఆదర్శాన్ని ప్రపంచం ముందుంచారు. అలాంటి సమాజం అహింసాయుత పద్ధతులద్వారా నిర్మాణం కావాలన్నది గాంధీజీ లక్ష్యం. "అహింసాయుత పద్ధతులద్వారా మనం పెట్టుబడిదారునిగాక పెట్టుబడిదారీ విధానాన్ని నిర్మూలించడానికి ప్రయత్నిస్తాం" అని అంటారు గాంధీజీ. రక్తం చిందించే ఆయుధాలకంటే అత్యంత పదునైన ఆయుధాలు సత్యము, అహింసలు. సత్యాహింసల కవచం ధరించిన యోధుడు ఎప్పుడూ పదునుగానే ఉంటాడని గాంధీజీ విశ్వాసం,

## ప్రేమ

ప్రేమ దేనినీ అర్థించదు. ప్రేమ తన సర్వస్వం ధార పోస్తుంది. ఎన్నో కష్టాలు భరిస్తుంది. ఎన్నడూ విసుగు కోదు ఎన్నడూ ప్రతీకారం చేయదు. ప్రేమ ఉన్నచోట ప్రాణం ఉంది. ప్రేమ ప్రపంచంలోగల మహావ్యక్తులలో ఒకడైనా, అది అతి నిరాడంబరమైనది. "ఎవరిపైన అయినా నేను అధికారం సాగించడానికి నాకు ప్రేమ తప్ప వేరేమి ఆయుధం లేదు" అని పలికే గాంధీజీ పలుకులలో ప్రేమ యెడల ఎంతటి సంపూర్ణ విశ్వాసం ఆయనకు వుండేదో ద్యోతకమవుతున్నది.

## మత సమానత్వం

గాంధీజీ హిందూమతావలంబి యైనను, సర్వమత సమానత్వమును బోధించారు. ప్రతివ్యక్తి తనమతం అంటే ఎంత గౌరవిస్తాడో, యితర మతాలంటే కూడ అంత గౌరవం ప్రదర్శించాలని గాంధీజీ చెప్పేవారు. ఒక మతం నుంచి యింకో మతానికి మార్చడం అంటే ఆయనకు చాలా అసహ్యం. దానికి బదులు "మనం హిందువుని మరింత మంచి హిందువుగాను, ముసల్మానులని మరింత మంచి ముసల్మానులుగానూ, క్రైస్తవులని మరింత మంచి క్రైస్తవులు గానూ మార్చడానికి ప్రయత్నించాలి" అనేవారు.

## అస్పృశ్యత

అస్పృశ్యత నిర్మూలనం కోసం గాంధీజీ ఎంతో శ్రమించారు. చిట్టచివరికి ఉపవాసాలు కూడా చేశారు. ఇది హిందూమతాన్ని తిని వేస్తున్న వేరుపురుగు లాంటిదని బాధపడేవారు. అస్పృశ్యులను గాంధీజీ హరిజనులని పిలిచే వారు వారికోసం అయన అఖండమైన సేవచేశారు. "అస్పృశ్యతను సమూలంగా నిర్మూలించడానికే నేను జీవిస్తున్నాను. అదే నేను కోరేది. దానికోసం ఆత్మార్పణం కూడా సంతోషంగా చేస్తాను" అని అన్నారు గాంధీజీ. హరిజనులను రానివ్వని ఆలయాలకు గాంధీజీ వెళ్ళేవారుకారు. అంతేకాదు "నేను ఒకవేళ జన్మించవలసివస్తే అస్పృశ్యుడుగా జన్మిస్తాను. ఆనాడు వారి బాధలలోను, కష్టాలలోనూ, విచారాలలోనూ, వారి అవమానాలలోనూ పాల్గొనడానికి వీలపుతుంది. వారిని ఆ బాధలనుంచి రక్షించడానికి, నన్ను నేను రక్షించుకోడానికి వీలవుతుంది." అని ఎంతో బాధను గాంధీజీ వెలిబుచ్చేవారు.

గాంధీజీకి స్త్రీలంటే అమిత గౌరవం. త్యాగానికి, కష్టాలు భరించడానికి, ప్రేమించడానికి స్త్రీకి సాటిగల వారెవరూలేరని గాంధీజీ అభిప్రాయం. వారు మూర్తీభవించిన క్షమాదేవతలని చెప్పేవారు. ధైర్యసాహసాలలో స్వార్థత్యాగం చేయడంలో స్త్రీ, పురుషునికన్న ఉన్నత స్థానం ఆక్రమిస్తుందని, పురుషుడు తన పశుబల ప్రదర్శనంలో మాత్రం స్త్రీ కన్న అధికుడని గాంధీజీ భావించేవారు. ఒక పర్యాయం గాంధీజీ ఒక ఉపన్యాసంలో "నేను గనుక స్త్రీనై జన్మించి వుంటే, ఎవరైనా స్త్రీ, పురుషుని ఆటవస్తువు అని గనుక అంటే, నేను తిరుగుబాటు చేస్తాను. స్త్రీ హృదయము తెలుసుకోడానికి నేను మానసికంగా మహిళగా ఊహించుకుంటున్నాను. నేను నా భార్యను మొదటి రోజులలో చూసినదానికన్న భిన్నంగా చూసేవాడను. భర్తృత్వాధికారాలనే నెపంతో ఆమెకుచెందిన హక్కులను, నేను నిర్వహించడం మానివేసిన తరువాత నేనామెహృదయం ఎక్కువ చూరగొనగలిగాను. పురుషుడు భగవంతుని స్వరూపం అయితే, స్త్రీ దేవతా స్వరూపం. ఆమె బానిస కాదు. సమాన హక్కులు గలవు. ఆస్తిలో కూతురికి వాటా కొడుకుతో సమానంగా వుండాలని, భర్త సంపాదించే సొమ్ముతో భార్యాభర్తలిద్దరికీ సమానంగా చెందాలని, సంతానంపై యిద్దరికీ సమాన హక్కులుండాలని, వారు పెద్దవారైన తరువాత ఆ హక్కులు వదులుకోవాలని, భర్త గనుక భార్య ఎడ క్రూరంగా ప్రవర్తిస్తే, ఆమెకు వేరుగా నివశించడానికి హక్కు వుండాలని గాంధీజీ ఆశించేవారు.

## వరకట్నం

వరకట్నం తీసుకొని, ఆ అన్యాయపు సిరితో తుల తూగే యువకులను సంఘం నుంచి బహిష్కరించాలని గాంధీజీ హెచ్చరించారు. కట్నం అనే హీనమైన దురాచారాన్ని అరికట్టడానికి ప్రజాభిప్రాయం సేకరించాలని, ఆడపిల్లల తల్లి దండ్రులు ఉన్నత విద్యాభ్యాసం గల వారంటే వ్యామోహం వదులుకోవాలని, తమ కులం, తమ రాష్ట్రం అన్న భావాలను వదలిపెట్టి, బుద్ధిమంతులైన యువకుల్ని తమ కుమార్తెలకు ఎన్నుకోవాలని గాంధీజీ హితం చెప్పారు.

## సంస్కృతం

" సంస్కృతం చదవడం అశ్రద్ధ చేస్తున్నాం. సంస్కృతం చదవడం కాలం వ్యర్థం చేయడమని, శ్రమవ్యర్థమని భావించే వారితో నేనేమాత్రం ఏకీభవించను. ప్రతి దేశభక్తుడూ సంస్కృతం చదవాలి. దానివల్ల మన రాష్ట్రీయ భాషలు తెలుసుకోవడం తేలికవుతుంది. ఆ అమర భాషలో మన పూర్వీకులు ఉత్తమ గ్రంథాలను రచించారు. సంస్కృతం అర్థంగాని వారికి మన ఔన్నత్యం బోధపడదు. మన మతంలోని గొప్పతనం తెలియదు " అని గాంధీజీ పేర్కొన్నారు.

## జాతీయ భాషలు

" ఆంగ్లభాష ఎన్నటికీ మన జాతీయభాష కాజాలదు. మనం ఇంగ్లీషు భాషపై పూర్తి ఆధిపత్యం ఎన్నటికీ సాధించలేము. మాతృభాషలో మన భావం వ్యక్తపర్చుకున్నంత సులభంగా ఆంగ్లభాషలో మనం వ్యక్తం చేసుకోజాలము. ఇంగ్లీషుమనకి బోధనాభాష కావడంవలన, మనం మామూలు ప్రజలకు దూరమైపోయాం. మన మేధావులంతా వేరొక వర్గంగా రూపొందారు. మన బాల్యంలో మన తల్లి దండ్రులు వేసిన భాషా పునాదిపై మనోభవనం నిర్మించుకోడానికి బదులు, ఆపునాదినే విస్మరించాం. ఇంతటి విషాదకర పరిస్థితి చరిత్రలో ఎక్కడా కనపడదు. బోధనా భాష తక్షణం మార్చివేయాలి. రాష్ట్రీయభాషలకి సక్రమ స్థానం కల్గచేయాలి. కొంతకాలంబాటు ఉన్నత విద్యారంగంలో ఇబ్బంది కల్గినా, ఆ నష్టం భరించతగ్గదే. దేశంలో ఉన్నతవిద్య అంతా ఇంగ్లీషులో బోధించడంవల్ల దేశానికి నైతికంగానూ, మానసికాభివృద్ధి దృష్ట్యానూ, చాలా నష్టం కల్గింది. మనం ఇంగ్లీషు నేర్చుకోకపోతే పని అంతా ఆగిపోతుందని కొందరు భావిస్తున్నారు. ఇది ఏమాత్రం వాస్తవంకాదు. యదార్థం అంతకన్నా కాదు. నేను ఇంగ్లీషు భాషను ఉన్నతస్థానంగల భాషగా అంగీకరిస్తాను. కాని అది భారతదేశపు జాతీయభాష కాజాలదు. వివిధ రాష్ట్రాలమధ్య ప్రజల సంపర్కభాష ఒకటి వుండాలి. అది హిందీయేనని నా అభిప్రాయం. జాతీయస్థాయిలో హిందీని సంధానభాషగా అభివృద్ధిపరస్తూ, రాష్ట్రీయ భాషలకీ సముచితమైన ప్రాధాన్యతనిచ్చి అభివృద్ధి పరచాలి " అని గాంధీజీ స్పష్టం చేసారు.

## విద్యారంగం

శీలం, ప్రవర్తన పెంపొందించడం ప్రథమ కర్తవ్యం. పిల్లలకు ధైర్యం, బలం, నీతి, ఉన్నతాశయాలు అలవర్చడం అవసరం. ఇవి అక్షరాస్యతకన్న ముఖ్యం. చదువు యొక్క ప్రధానలక్ష్యం కూడా అదే. వీటిని సాధించలేని చదువువల్ల ప్రయోజనం శూన్యం. మనది గ్రామీణ నాగరికత. చదువుకున్న విద్యార్థులందరూ గ్రామాలు చేరుకోవాలి. వారంతా తమ అలవాట్లను మార్చుకోవాలి. వారి శలవలన్నీ తమ కళాశాలలకు దగ్గర వున్న గ్రామాలలో గడపాలి. గ్రామీణుల సేవ చేయదల్చుకున్న వారికి శలవులలో చదువుకి బదులుగా గ్రామ పునరుద్ధరణ కార్యక్రమాలలో శిక్షణ గరపాలి. విద్యార్థులు శలవుకాలంలో కొంతభాగం హరిజనోద్ధరణకి వినియోగించాలి. శలవులు ప్రజాసేవకీ, క్రీడలకీ, వినోదాలకి కేటాయించాలిగాని పుస్తకాలు కంఠస్థం చేయడానికి వినియోగించకూడదు. స్వాతంత్ర్యం వచ్చాక విద్యారంగంలో గణనీయమైన మార్పును తీసుకునిరావాలి. – అని గాంధీజీ తన ఆవేదనను వెలిబుచ్చారు.

## సత్యాగ్రహం

సత్యాగ్రహం అంటే బాధలు అనుభవించడం. ఇది ఎంత నిర్మలమైనదయితే అంతమంచిది. అప్పుడే సత్యాగ్రహం ప్రభావిత మవుతుంది. సత్యాగ్రహ ఉద్దేశ్యం భయపెట్టడంకాదు; మనస్సును మార్చడం. నిర్బంధించడం కాదు; మార్పు తీసుకొనిరావడం. సత్యాగ్రహం సాధువయినది. అది ఎవరికీ హాని కలిగించదు. కోప, ద్వేషాలకు ఫలితం సత్యాగ్రహం కారాదు. దానిలో ఓరిమిలేమితనానికి, వాచాలతకు తావుండకూడదు. నిర్బంధానికి

అది శుద్ధ వ్యతిరేకమైనది. హింసకు సంపూర్ణమైన ప్రత్యామ్నాయంగా సత్యాగ్రహం కల్పించబడింది. సత్యాగ్రహం అమోఘమైన అత్యంత శక్తివంతమైన సాధనం. దీనిద్వారా విలువగల ప్రతివస్తువునూ పొందవచ్చును. సత్యాగ్రహం అంటే అసలు అర్థం సత్యానికే కట్టుబడి ఉండటం. అంతేకాదు "సత్యాగ్రహం"-అంటే సత్యం ప్రేమ, అహింసల యొక్క శక్తి అనటం కూడా బాగుంటుంది. సత్యాగ్రహం అంటే సత్యాన్వేషణ. సత్యం అంటే భగవంతుడు నాకు. సత్యాన్ని చూపే జ్యోతి "అహింస". ఈ సత్యంలోని భాగమే స్వరాజ్యం. స్వరాజ్యం సంపాదించడం ఏ విధంగా మన జన్మహక్కని భావిస్తున్నామో, దానిని సాధించడానికి సత్యాగ్రహం మన జన్మహక్కు" అని గాంధీజీ ఎలుగెత్తి చాటారు.

## ప్రజాస్వామ్యం

ప్రజాస్వామ్యవాది, పుట్టుకతోనే క్రమశిక్షణ గలవాడవుతాడు. ఎవరైతే సహజంగా, స్వచ్ఛందంగా, అన్ని చట్టాలనీ, ప్రకృతి సిద్ధాంతాలనీ, అనుసరిస్తారో, అట్టి వారికి ప్రజాస్వామ్యం అలవడుతుంది. ప్రజాస్వామ్యవాది స్వార్థ రహితుడు. ప్రజాస్వామ్యమంటె, ప్రజలలో అన్నివర్గాల, భౌతిక, ఆర్థిక, ఆధ్యాత్మిక సాధన సంపత్తినంతటినీ, ప్రజలందరి సౌభాగ్యానికీ సేకరించగల కళ. ప్రజాస్వామ్యంలో బలవంతుడికీ, బలహీనుడికీ సమానావకాశాలు లభించాలి. ప్రతిపక్షం అభిప్రాయాలను వినడం నేర్చుకోకపోతే మన ప్రజాస్వామ్యం పెంపొందదు. అసహనం అలవరచుకుంటే, నిజం తెలుసుకోజాలం. ప్రజాస్వామ్యానికి పునాది స్వేచ్ఛ. వ్యక్తికి స్వేచ్ఛ వున్ననాడే, అతడు పూర్తిగా సంఘమునకు సేవచేయ గలుగుతాడు. అది లేనినాడు అతడు యంత్రంలో ఒక భాగంలా తయారవుతాడు. సంఘం క్షీణిస్తుంది. అధిక సంఖ్యాకులకి, అధిక లాభం అన్న సిద్ధాంతం అసమగ్రమైనది. దీనిలో 50 మందికి లాభం చేయడం కోసం 49 మందిని బాధపెట్టడం జరుగుతుంది. ఇది మానవజాతికి అమితమైన అపకారం చేసే సిద్ధాంతం. "బహుజన సుఖాయ, బహుజన హితాయ" బదులు "సర్వజన సుఖాయ, సర్వజన హితాయ" గాంధీజీ ప్రవేశపెట్టిన సిద్ధాంతం. ఎవరో 20 మంది మంత్రులు కేంద్రంలో కూర్చుని నిజమైన ప్రజాస్వామ్యం నిర్వహించజాలరు. ప్రభుత్వం ప్రజలందరిది గనుక ప్రజలందరూ నష్టంలో, లాభంలో బాధ్యతను స్వీకరించాలి. అప్పుడే ప్రజాస్వామ్యం విజయవంతమవుతుందని గాంధీజీ ఏనాడో స్పష్టం చేశారు.

## ధర్మకర్తృత్వ సిద్ధాంతం

గాంధీజీ భారతీయ సంస్కృతీ సాంప్రదాయానికి అనుగుణంగా ధర్మకర్తృత్వ సిద్ధాంతాన్ని అంగీకరించారు. వ్యక్తిగత ఆస్తి అనే భావానికే ఆయన వ్యతిరేకి. ఆస్తి అంతా భగవానునిదేనని, వ్యక్తి ఒక ధర్మకర్తగా మాత్రమే ఆస్తిని కలిగివుండవచ్చునని ఆయన బోధన. ఆయన దృష్టిలో ఆస్తి సమాజపరమైనది. కనుక అది సమాజపు కోరిక మేరకు మారే వస్తువు. ప్రాథమిక అవసరాలకు మించి ఆస్తి కలిగివుండటం ఆయన దృష్టిలో దోపిడీయే. ఈ ధర్మకర్తృత్వ సిద్ధాంతం ద్వారానే

## గమ్యం

"వైణికా! ఎక్కడికి?"
"విశ్వ వీణా గళ ద్వారంలో చెలరేగిన
అపశ్రుతులు అరికట్టడానికి —"
"గాయకా! ఎక్కడికి?"
"ఆవేశంతో శాంతిగానాల నాలపించడానికి-"
"మహాకవీ! మరి నీ పయనం?"
"కలం బలంతో కల్మషాన్ని కాల్చడానికి-"

— సామవేదం షణ్ముఖశర్మ

## ధరలు చంద్రమండలానికి ప్రజలు పాతాళానికి

అమెరికా, రష్యాలు పోటీపడి చంద్ర మండలానికి రాకెట్లను, మనుష్యులను పంపిస్తుంటే, మన ప్రభుత్వం మాత్రం నిత్య జీవితావసర వస్తువుల ధరలను చంద్రమండలానికి పంపించగలుగుతున్నది. 1973–77 మధ్యకాలంలో ద్రవ్యోల్బణం రేటు 22.5% 1977–79 లో అనగా జనతా ప్రభుత్వ హయాంలో 2.5% వుండగా, 1979–80లో అది 18.5% పెరిగింది. "బడ్జెట్ తరువాత ద్రవ్యోల్బణం పెరుగుదల కేవలం 3.5% మాత్రమేనని ప్రభుత్వం చెబుతున్న అంకెల గారడీ వినియోగదారుల కడుపు మంట చల్లార్చద"ని శ్రీ మధు దండావతే లోకసభలో అన్నారు.

ధరల స్థిరీకరణ ఒక్క జనతా ప్రభుత్వ హయాములో మాత్రమే జరిగింది. మరల అటువంటి అదృష్టం ఈ దేశానికి ఎప్పుడు పడుతుందో !

హైందవ సోషలిజంను సాధించగలమని గాంధీజీ నమ్మిక. ఈ సిద్ధాంతం పెట్టుబడీదారీ విధానానికి తావివ్వదు. అయితే సంపన్న వర్గానికి తనను తాను సంస్కరించుకునే అవకాశం కల్పిస్తుంది. మానవ స్వభావంలో సంస్కరణకు సదవకాశం ఏనాడైనా ఉంటుందనే విశ్వాసం ఈ సిద్ధాంతానికి ప్రాతిపదిక. కనుక గాంధీజీ దృష్టిలో–ఆస్తి సమాజానికి చెందినదని, ప్రజల శ్రేయస్సుకు అనుగుణంగా ఆస్తిని వినియోగించే హక్కు సమాజానికి కలదని తేటతెల్లం

## స్వాతంత్ర్య సమర సారధి

గాంధ్ ఆయన సందేశం. కొన్ని మూల సూత్రాల ప్రకారం ఆయన జీవించారు. ఐదు దశాబ్దాలకు పైబడి సాగిన గాంధిజీ సుదీర్ఘ ప్రజాహిత జీవనం 1893 లో దక్షిణాఫ్రికాలో ప్రారంభమయింది. సహాయ నిరాకరణ విధానంలోని అద్భుతశక్తి సామర్థ్యాలు ఆయనకు అక్కడే తొలిసారిగా అవగతమైనాయి. ఆయన 1915 లో భారత రాజకీయాలలో ప్రవేశించి, 1920 లో లోకమాన్య బాలగంగాధర తిలక్ నిర్యాణం అనంతరం స్వరాజ్య ఉద్యమానికి సారధ్యం వహించారు. వాస్తవానికి ఆనాటి నుండి మూర్తీభవించిన స్వరాజ్య సమరమే అయింది ఆయన వ్యక్తిత్వం. సహాయనిరాకరణ ఉద్యమం, సత్యాగ్రహోద్యమం, క్విట్ ఇండియా ఉద్యమాల రూపంలో పోరాటాలు సాగించి, ఉద్యమాలమధ్య భారీఎత్తున నిర్మాణ కార్యక్రమాలు నిర్వహించి 1947 లో దేశానికి స్వరాజ్యం సాధించిన ఘనత మహాత్మాగాంధీజీకి దక్కింది. స్వాతంత్ర్య సమర సారథిగా భారత జనత ఆయనకు నివాళులర్పించింది.

మహాత్మా గాంధీజీ జన్మస్థలం గుజరాత్ లోని 'పోరుబందరు'. దాని పూర్వపుపేరు 'సుదామపురి' అది శ్రీకృష్ణుని నివాసస్థలమగు ద్వారకాక్షేత్రమునకు, ఏబది మైళ్ళలో వున్నది. ఆ మహనీయుని జన్మదినం ది 2 – 10 – 1869 మహాత్ముని అసలుపేరు "మోహన్ దాస్ కరంచంద్ గాంధీ" దీనిలో మోహన్‌దాస్ ఈయన స్వంతపేరు. 'కరంచంద్' తండ్రి పేరు 'గాంధీ' వీరి వంశనామం. తల్లి పేరు 'పుత్తలీబాయి'. ఆమె నిగ్రహం, నిదానం, దైవభక్తి, ఉపవాస ప్రీతి, సౌజన్యము మన స్వాతంత్ర్య సమరసారధికి సంక్రమించినాయి. 1948 జనవరి 30 న ఒక హంతకుని తుపాకీ గుండుకు బలి అయి మహోన్నత మానవతావాది, ఆధ్యాత్మిక తత్త్వవేత్త అయిన మహాత్మా గాందిజీ మహోజ్వల జీవితం పరిసమాప్తమయింది.

– కొమరగిరి

# ఎగరలేని చిలుక కకాపో

డా॥ దుగ్గరాజు శ్రీనివాసరావు

ఆస్ట్రేలియా ఖండం అనేక వింత జంతువులకు, పక్షులకు ప్రసిద్ధి. ఆ ప్రసిద్ధి చెందిన జీవులన్నిటిలోకి చెప్పుకోతగ్గది న్యూజీలాండ్ దేశంలో కనిపించే కకాపో అనే పక్షి. కకాపో చిలుకల జాతికి చెందిన పక్షి. కాకుంటే ప్రకృతిలో లభించే ఇతర చిలుక జాతులకు కకాపోకు అసలు పోలికలే వుండవు. చిలుకలు సాధారణంగా మెరుస్తున్న ముదురు రంగుల్లో ఎంతో అందంగా ఉంటాయి. అంతే కాకుండా చిలుకలు గాలిలో వేగంగా ఎగరగలవు. కాని వీటన్నిటికి భిన్నమైన లక్షణాలు కలిగివుంటుంది. కకాపో

కకాపో పొడవు 60 సెం. మీ. బరువు రెండు కిలోల వరకు వుంటుంది. కకాపో శరీరం లేత ఆకుపచ్చ రంగులో కొద్ది మచ్చలతో వుంటుంది. అందువల్ల కకాపో ఆకర్షణీయంగా వుండదు. ఎగరటానికి అవసరమైన రెక్కలు, కండరాలు, కకాపోకి తగినంతగా అభివృద్ధి చెందలేదు. అందువలన కకాపో గాలిలో ఎగరలేదు. కకాపో తన కాళ్ళ సహాయంతో చెట్ల కొమ్మల మీదకు చేరుతుంది. అక్కడి నుండి రెక్కలను విప్పుకుని గాలిలో తేలుతు నెమ్మదిగా కిందికి దిగుతుంది. ఎగిరేశక్తి లేకపోవటం వల్ల దీని మకాం కూడా నేల మీదనే. చెట్ల మొదలులో మట్టిని తవ్వి కలుగు ఏర్పరుచుకుంటుంది. ఈ కలుగులో మెత్తటి ఈకలను, గడ్డిపోచలను చేర్చటంతో దీని గూటి నిర్మాణం పూర్తవుతుంది. కకాపో మిగిలిన ఇతర చిలుకల వలెనే శాకాహారి. పండ్లు. ఫలాలను మాత్రమే భుజిస్తుంది. జంటకుదిరిన కకాపో సుమారు నాలుగు నుంచి ఆరు గుడ్ల వరకు పెడుతుంది. గుడ్లను సంరక్షించటంలో ఆడ, మొగ రెండు సమానమైన పాత్రను నిర్వహిస్తాయి. సంతానానికి చాలాకాలం వరకు తామే ఆహారాన్ని అందిస్తుంటాయి.

చిలుక జాతులన్నింటిలోకి శాస్త్రజ్ఞుల దృష్టిని అత్యధికంగా ఆకర్షించినది ఈ కకాపో. ఈ కకాపో పక్షి గురించి రెండు వందల సంవత్సరాల క్రితమే తెలిసినప్పటికి, దీనిని చిలుకగా గుర్తించటం జరగలేదు. అందుకు కారణం కకాపో చూపులకు గుడ్లగూబను పోలివుండటం. అంతేకాకుండా కకాపో నిశాచరి. అంటే పగలంతా




గూటిలో విశ్రాంతి తీసుకుని రాత్రిపూట ఆహారం కోసం సంచరిస్తుంది. అందువల్ల చాలాకాలం వరకు దీన్ని గుడ్లగూబలతో జత చేయటం జరిగింది. ఆ తరువాత పరిశోధకులు కకాపోను పరిశీలించి చిలకగా నిర్ధారించారు.

కకాపో ఆ తరువాత చాలాకాలం వరకు శాస్త్రజ్ఞుల దృష్టికి కనిపించకుండా పోయింది. చివరికి కకాపోని 1928 లో అంతరించి పోయిన పక్షి జాతుల్లో కలిపేశారు. కాని 1958లో హఠాత్తుగా కకాపో న్యూజిలాండ్‌లో కనిపించింది. అప్పటినుంచి కకాపో సంఖ్య గణనీయంగానే గుర్తించటం జరిగింది. జంతు ప్రదర్శన శాలలకు చేర్చి కకాపో జాతిని భద్రపరచటానికి కావాల్సిన ప్రయత్నాలన్నీ చేశారు. అయినప్పటికి ప్రస్తుతం కకాపో అంతరించిపోయే దశకు చేరిందని శాస్త్రజ్ఞులు ఆందోళన చెందుతున్నారు. ఇందుకు కారణం ఎగిరే శక్తి లేని ఈ పక్షిని అక్కడి ప్రజలు అధిక సంఖ్యలో సంహరించటమే. ప్రపంచ వన్యప్రాణి సంరక్షణ సంస్థవారు కకాపో రక్షణకు ప్రత్యేక ఏర్పాట్లు చేయవలసిందిగా న్యూజీలాండ్ ప్రభుత్వానికి విజ్ఞప్తి చేశారు. ఇకనైనా ఆ దేశప్రభుత్వం తీసుకునే చర్యలవల్ల కకాపో రక్షింపబడుతుందని ఆశిద్దాం. ★

# రాయల వారి నిశిత పరిశీలనాదృష్టి

విషయ సందర్శనాభిలాష, సర్వజన సామాన్యమైనా, ఆంతర్‌దృష్టి, భావనాదృష్టిగల వ్యక్తి గుడమిశ్రౌషధ న్యాయంగా దృశ్యా దృశ్య విషయాలను సహృదయ హృదయాహ్లాదకరంగా పది కాలాలపాటు నిలిచేటట్టు సృష్టి చేయాలనే తపనతో నుంటాడు. ఈ దొడ్డగుణమే ఆ వ్యక్తి ని ఇతర వ్యక్తులనుండి వేరుపరచి ఒక ప్రత్యేక స్థానాన్ని అలంకరింప చేస్తుంది. మహారజితము, రత్నము విడి విడిగానుండి నుండినపుడును దేని విలువే దానికున్నను, ఆ రెంటికి సంయోగము లభించినప్పుడు అది మరింత మందిని ఆకర్షించినట్లే భావనాబలమునకు, భాష, అలంకారములు తోడైనప్పుడు ఔచితీమంతమై సర్వాంగ సుందరమైన రామవలె అభిరామమై అలరారుతుంది. ఈ విశేషాన్నే ఆలంకారిక పరిభాషలో ఔచిత్యమంటారు.

## అయ్యగారి నరసింహమూర్తి

కవన రంగంలోను, లలితకళా రంగంలోను కాకలు దీరిన వ్యక్తి విజయనగర సామ్రాజ్యము నేలి, ఆంధ్ర భోజునిగా వాసికెక్కిన శ్రీకృష్ణదేవరాయలు. ఈతని ఆముక్తమాల్యద పంచకావ్యాలలో పేరెన్నిక గనడానికి అనేక హేతువులున్నాయి. చాలా పద్యాలు అయఃపిండాల వలె ఉన్నా సామాన్య పాఠకులచే గూడ తలలూపింప చేయగల పద్యాలు అందులో పొడసూపుతాయి. ఈ క్రింది పద్యం అట్టిది.

"తలపక్షచ్ఛట గ్రుచ్చి బాతువులు కేదారంపు గుల్యాంతర
స్థలి నిద్రింపగఁ జూచి ఆరెకులు షస్నాత ప్రయాతద్విజా
వళి పిండీకృత శాటికల్పవితదా వాసంబు చేర్పంగ రే
వుల డిగ్గన్ వెసఁ బాఱువానిగని నవ్వున్ శాలి
గోప్యాఘముల్ "
(1-65)

అది విలుబుత్తూరు. ఆ పట్టణపు మాగాణులలో వరి మళ్ళకు ప్రవహించే నీటికాలువల మధ్యభాగంలో ప్రాతర్వేళలో బాతులు గఱుల ముత్తములో తలదూర్చి నిశ్చలంగా నిద్రపోతూంటే ఊరికాపరులు వానిని చూచి అంతకుముందే స్నానముచేసి ఏమరపాటున విడిచిపోయిన బ్రాహ్మణుల వస్త్రపు పిడుచలని భ్రాంతిపడి వానిని వారికి చేర్చవలెననే ఉద్దేశంతో రేవులందు దిగితే ఆ సందడి కవి మేల్కాంచి తటాలున పరుగెత్తుకొనిపోయే సన్నివేశం చూచి అచటి పైరుకాపరి చెలువలగణము నవ్వుతూంటూందట.

ముక్కులను రెక్కలలో దూర్చి కాలువల దరిని బాతులు నిద్రించటం ఎల్లరు చూచే సామాన్య సన్నివేశమే. అయితేనేం ! చేయి తిరిగినవాని చేతిలో శిల శిల్పంగా మారినట్లుగా, చిత్రకాడుని కుంచెలో రంగులు సుందర దృశ్యములుగా రూపొందినట్లు రాయల చేతిలో నీ దృశ్యం మంచి సౌకుమార్యాన్ని, సౌభాగ్యాన్ని సంతరించుకుంది. నిశ్చలంగా నిద్రిస్తున్న బాతులు స్నానార్థమై వచ్చిన బ్రాహ్మణులు విడిచిపోయిన వస్త్రపు పిడుచలుగా రాయలకు పొడ సూపడం ఆయన పచేళిమమైన భావనాశక్తి కొక చక్కని తార్కాణం. ఇయ్యది సుందరతరమైన మధురోహ. నిద్రించే తరుణంలో బాతులు తలను రెక్కలందు గ్రుక్కుట వానికి నైజవిషయం. ఇట నీ విషయ ప్రస్తావన ఊరి కాపరుల భ్రమకు హేతువు. ఇది ఆతని పరిశీలనా సక్తికి, హృదయ రంజక శక్తికి ఉదాహరణముగా నెన్న తగును.

పరిపూర్ణమైన భావనలకు అలంకారములు అలంకరణములు కాగా, ఇటువంటి పద్యాలు కంటబడిన వెంటనే పాఠకుడాసక్తుడై ఆ పద్యములను పదే పదే స్మరించుకోగలగడంలో ఆశ్చర్యంగాని అతిశయోక్తి గాని కనబడదు.

Love at first sight అనిగదా సూక్తి. ఏదైన ప్రథమ (సం) దర్శనంలోనే మనసుకు హత్తాలి. మళ్ళా మళ్లా చవి చూడాలని అనిపించాలి. అందుకనే కవిరాజశిఖామణి, రాజకవియైన నన్నెచోడుడు.

ముదమున సత్కవి కావ్యము
నదరగ విలుకాని పట్టి నమ్మును పరహృ
ద్భిదమై తల యూపింపని,
యది కావ్యమె యలరి పట్టినదియుం శరమే ?

సంగీత, సాహిత్య సమరాంగణములను త్రిపథములలోను దిట్టయైన రఘునాధనాయకుడు కూడ

చెప్పవలెం గప్పురంబులు
కుప్పలుగాం బోసినట్లు కుంకుమ పైపైం
గప్పిన క్రియ విరి పొట్లము
విప్పినగతి ఘుమ్మనం గవిత్వము....అని చెప్పాడు.

పై చెప్పిన కృష్ణదేవరాయల పద్యం ఆనాటి ఆతని పరిపాలనా దక్షతను, జాతి ఆచారాలను, నైతిక వర్తనను, పాలకుల అప్రమత్తతను దర్పణం పట్టినట్లు ప్రస్ఫుటీకరిస్తోంది.

పగలంతా కష్టపడి సాయంత్రం గూటికి చేరిన పిదప ఇల్లాండ్రు చేసిన వంటకాలను పిల్లా జెల్లలతో గూడి ఉల్లాసంగా ఇంత తిని, మరునాటి కార్యనిర్వహణకు తగినంత శక్తిని, ఉత్సాహాన్ని చేకూర్చుకోడానికి కంటినిండ నిద్రపోవడమనేది ప్రకృతి ఇచ్చిన వరం. ఇలా ఆద మరచి నిద్రపోవాలంటే తన పరిసరాలన్నీ చోరాది భయాలు లేకుండ నిరుపద్రవంగా ఉండాలి. దానికై ఆ రోజుల్లో ఒక ప్రత్యేక విభాగం రాత్రి ఊరంతా గస్తీ తిరగడానికుండేది. ఆ దళం నేతి బీరకాయ వంటిది కాదు. నీతి_నిజాయితీ కలిగినది. దండనీతిని, పాపభీతిని ఆకళించుకొన్నది. ఈ దళములకు విలువెల్లా కళ్ళే. ఎప్పు డెక్కడ ఎవరు, ఏ గతిని పారవేసుకొన్నా పరితపించవలసిన పని ఉండెడిది కాదు. నాడో, ఆవలినాడో పోయినది ఆ హక్కుదారులకు ఎట్టి స్థితినైన చేరితీరవలసినదే.



అయితే నేడునూ అవసరాన్నిబట్టి ఇట్లాంటి దళాలు తిరుగుతూనే ఉన్నాయి. చేజారిన వస్తువులినాడు పెక్కు సందర్భాలలో తిరిగి రావడమనేది కలలోని వార్త. కారణం పనియందు లక్ష్యం శ్రద్ధాసక్తులు సడలిపోయాయి. అర్థం మీద వ్యామోహం అధికమైపోయింది. "ధనమూలమిద జగత్తు"ను సూక్తి అధికారుల నరనరాల జీర్ణించుకొని పోయింది. పరమార్థ- చింతన మందుకైన పాలకుల్లో కనపడదు.

"మార్పు" జీవలక్షణం గనుక సజీవమైన భాషలో గూడ మార్పులు మనకు గోచరిస్తాయి. నాడు బొతువులు అనే పదం నేడు బొతులుగా మారింది. "ఆరెకులు" అనే పదం వ్యవహారానికి దూరమైంది. "గస్తీ" పదానికి ప్రాచుర్యం, ప్రాబల్యం వచ్చింది.

ఇక ఒక్క డ్యూటీకో, ప్రయాణానికో తప్ప సూర్యోదయానికి పూర్వం లేవడమనేది మృగ్యమై పోయిందనే చెప్పాలి. సాధన సంపత్తి చేకూరడం వలన నీలాటి రేవులకు పోయి నీరు తెచ్చుకోవలసిన అవసరము తీరిపోయింది.

సునిశిత పరిశీలనా విషయంలో కాళిదాసు పిదప చెప్ప దగినవాడు రాయలే అని చెప్పడం అతిశయోక్తి కాదనుకుంటాను.

మి నీ క థ

# పోలీసులు బాబోయ్ పోలీసులు

ఫస్ట్ షో సినిమా వదిలారు.

నేను, గిరీశం మాట్లాడుకుంటూ వస్తున్నాము. మామూలుగా మెయిన్‌రోడ్డు రద్దీగా ఉంటుంది కాబట్టి, నేను గిరీశంతో ఓ సన్న గొందిలోకి దూరాను.

ఆ వీధి పగటిపూటే నిశ్శబ్దంగా, నిర్మానుష్యంగా ఉంటుంది. ఇక రాత్రిపూట చెప్పనే అక్కర్లేదు. గిరీశం వద్దంటున్నా వినకుండా నేను ఆ వీధిగుండా ఇంటికి తొందరగా చేరొచ్చని ఆ వీధివైపు నడిచాను.

ఆ వీధి దాటితే, ఓ చిన్న 'పోలీస్టేషన్' కూడా ఉంది. ఆ ధైర్యంతోనే, మేము, మాట్లాడుకుంటూ, కాస్త నిదానంగా నడవ సాగాము. ఇంతలో దూరంగా, ఏదో అలికిడి వినబడింది. కాసేపటికి ఓ మూలుగు వినపడింది. అది ఎవరో 'ఆడావిడ' మూలుగే. మేము, కాస్త వేగంగా ఆ మూలుగు వస్తున్న చోటుకు పరిగెత్తాము.

రం ధ మూ ర్తి జ నా ర్ధ న్

వీధిలైటు వెలుతురులో కాస్తంత మసగగా కనబడింది ఆ దృశ్యం. ఓ అమ్మాయిని ఎవడో మానభంగం చేస్తున్నాడు.

నేను కాస్త ధైర్యం చేసుకొని "ఎవర్రా" అని గట్టిగా అరిచా. అంతే....ఆ వెధవ గబగబ చుట్టూ చూసి పరిగెత్తాడు. నేను వెంటనే గిరీశంతో "ఒరేయ్, గిరీ, ఈ అమ్మాయిని నువ్వు హాస్పిటల్‌కు తీసుకెళ్ళు. నేను, ఆ వెధవను పట్టుకుంటా" అని, వాడు పరిగెత్తిన వైపు పరిగెత్తాను.

ఆ క్షణంలో నాకంత ధైర్యం ఎలా వచ్చిందో నాకే తెలియదు.

ఆ వెధవను కూడా నేను సరిగ్గా గమనించలేదు. మొఖం మాత్రం నల్లగా చింతనిప్పులలాంటి కళ్ళతో భయంకరంగానే ఉంది.

వాడివైపు పరిగెత్తానే కానీ వాడి వేగాన్ని అందుకోలేక పోయాను. వాడు చీకటిలో కలిసిపోయాడు.

నాకు ఏమిచేయాలో తోచలేదు.

వెంటనే....నాలో మెరుపులాంటి ఆలోచన వచ్చింది.

మరి ఆలస్యం చేయకుండా, పక్క వీధిలో ఉన్న పోలీసు స్టేషనుకు పరిగెత్తాను.

అక్కడంతా నిశ్శబ్దంగా ఉంది.

లోపలికి తొంగి చూశాను.

లోపలెవరో కనపడ్డారు.

వెంటనే, నేను స్టేషను లోకి పరిగెత్తాను.

లోపల....

పోలీసాఫీసరుకు నేను చూసింది చెబుతామని వెళ్లాను. కానీ, అక్కడ కూర్చున్న ఆ పోలీసోన్ని చూసి అదిరిపడ్డాను. నల్లగా చింతనిప్పుల్లాంటి కళ్ళతో...రొప్పుతూ.... నా నోరు పెగలలేదు.

అతనికేసి, ఓ రెండు నిమిషాలు తీక్షణంగా చూసి బయటకు పరిగెత్తబోయి, ఆ స్టేషన్‌లోని ఫోటో చూసి అదిరిపడ్డాను.

ఆ ఫోటోలో ఆ చింతనిప్పు కళ్ళ పోలీసోడున్నాడు. కాస్త పరీక్షించి చూస్తే "ఉత్తమ పోలీసాఫీసరు" అన్న ప్రశంశాపత్రమది.



## ఆటో – గేటుముందాగింది.

రామచంద్రమూర్తి ఆత్రంగా పరిసరాలను కలియజూసేస్తున్నాడు. అవసరానవసరాలతో నిమిత్తం లేకుండా పరిసరవర్ణన చేయడం- పేజీలు పెంచడానికి మంచి ట్రిక్ అట! పూర్వకావ్యాలనూ ప్రబంధాలనూ యీ విషయంలో మాత్రం పోలి ఉంటాయట నేటి సీరియల్స్.

మనిషి...అదే...కధలో పాత్ర...పొడవు...వెడల్పు, బరువులు...అతను తొడుక్కున్న ప్యాంటు రంగూ దానిమీది డిజయినూ ... ఆతను వేసుకొన్న జోళ్ళు...అవి తయారయిన కంపెనీ...యిలాగ రాసుకు పోతూండడమేనట. బట్టలు...కారు...జోళ్ళు...వీటిని మాత్రమే వర్ణిస్తూ బోలెడన్ని నవలలు రాసిన రచయిత గురించి చెప్పాడు మధుమూర్తి.

జరిగిన కథ

రాయటానికి కథా వస్తువేం దొరక్క కూర్చుంటాడు రామచంద్రమూర్తి. దయానిధి పిలుపుతో బయటకి వస్తాడు. మూర్తి జూనియర్ లెక్చరర్‌గా పనిచేస్తూ Ph. D. పూర్తిచేసి ప్రమోషన్ పొందాలని చూస్తూ వుంటాడు. దయానిధి "ఆంధ్రులపై తెలుగు నవలల ప్రభావం" అన్నదానిమీద థీసిస్ చేయదలచి, అందుకు రామచంద్రమూర్తి సహాయం అడిగాడు. మూర్తి 'నవల' రాస్తున్నాడన్న విషయం విని ఆశ్చర్యపోతాడు దయానిధి. మర్నాడు పిచ్చాసుపత్రికి వెళ్ళి అక్కడవున్న బంధువుని కలుసుకుందామంటాడు. రామచంద్రమూర్తికి ఒక ఆలోచన వస్తుంది. ప్రతి పిచ్చివాడి వెనుకా ఒక కథ వుంటుంది, అది నవలకి కథావస్తువుగా ఏమన్నా పనికొస్తుందేమో. అన్న ఆలోచనలో రామచంద్రమూర్తికి ఆ రాత్రి ఒక పిచ్చికల వస్తుంది.

ఇక చదవండి




"నవలలో—వర్ణించవలసింది మానసిక సంఘర్షణ కాదా ?" అంటే ఒక్కముక్కలో కొట్టి పారేశాడు. "ఇంటలెక్చువల్ అప్రోచ్ అనేది పాతబడిపోయింది. అదిప్పుడు ఔటాఫ్‌డేటూ, ఔటాఫ్ అప్రోచ్ .... ఆమె తన భర్తకు పెళ్ళిలో తన తండ్రి ఐదువందలు పెట్టి కొన్న వెండి కంచం — నల్లబై ఎనిమిది తులాలది .... విమ్ వేసి తళతళలాడేలా కడిగి .... కంచం మధ్యనున్న పద్మం డిజైనుని ప్రేమగా మరోసారి తోమి—తొలిచి—అప్పటికే వేసి ఉంచిన పీట ముందు పెట్టింది. స్కీమ్‌లో కొన్న....అనగా....నెలకు పదిరూపాయల స్కీములో మూడవనెలలోనే అదృష్టం వరించగా వచ్చిన వందరూపాయల సామానులో ఒకట

# బిత్తల

బిత్తల = దిసమొల, దిగంబరము

యుగయుగాంతరముల నుండి వెలుతురు మీద
వెలుతురు తొడిగినా
చివరకు పట్టి చీకటి.
బట్టమీద బట్ట కట్టి చింపినా
మూయలేని బిత్తల.
ఈ చీకటి-బిత్తలలకు ఎవరుమాత్రం
వెలుతురు బట్ట తొడిగి ముగిస్తారు !
శతమానాలనుండీ నాలోనుంచి బయటకువచ్చి
నిలిచిన బిత్తలకు
మాటల అంగి తొడుగుతున్నాను,
ఒక్కొక్క అంగి తొడిగినపుడెల్లా అవన్నీ
ఒక్కొక్క రకంగా కవబడతాయి.
అయినా మరల మరల వచ్చి నిలిచే
ఈ బిత్తలలకు
ఎవరుమాత్రం మాటల అంగి తొడిగి
ముగిస్తారు !

కన్నడమూలం : జి. యస్. శివరుద్రప్ప

అనువాదం : తంగిరాల

యిన కోయంబత్తూరు స్టీలుతో చేయబడిన కొత్తగ్లాసుతో- కంచానికి ఎడమపక్కగా మంచినీళ్ళు పెట్టింది విందుగా. అంచుల వరకూ నీళ్ళతో నిండిన ఆ మంచినీళ్ళ గ్లాసు— అంతరంగమంతా పతియందలి ప్రేమతో నిండిన ఆ మంచి స్త్రీకి ప్రతీకలా ఉంది.

అప్పుడామె.... దోసకాయ, ఇంగువ వేసి చక్కగా తయారు చేసిన పప్పు వేసింది వెండికంచంలో. ఆ పప్పుకి కొంచెం దూరంలో కుడి పక్కగా కూర వేద్దామా పచ్చడి వేద్దామా అని ఒక క్షణం ఆలోచనలో పడింది శకుంతల. చివరకి - కూరే వేద్దామని నిశ్చయానికి వొచ్చి.... ఒక్క నిట్టూర్పు గాఢంగా విడచి (?) ఆవపెట్టి - పోపు వేసి వండిన కాబేజీ కూరను - వెండి కంచంలో....పప్పుకి.... కుడి పక్కగా వడ్డించింది........"

ప్లీజ్.... మధుమూర్తీ.... అపు ఆపెయ్. నాకు కడుపులోంచి తెర్లుకు వొస్తూంది. "

" బాగుంది....వాస్తవికతను గురించడం మానేసి వాంతి వొస్తూందంటారేం ? "

" కొన్ని వాస్తవికతలు - వాంతులే. దుర్భరంగా ఉంటాయి చదివేందుకు. ఆమె అతనికి అన్నం పెట్టిందని రాస్తే పోలా ? వండిన వంటలూ పడినపాట్లు అన్నీ దేనికి ? "

" వాస్తవికత. ఆ పైన పేజీల నింపుడు కార్యక్రమం. ఇలా రాస్తేనే కొందరు పాఠకులు రచయితకి సామాజిక స్పృహ ఉందని అంగీకరించి మెచ్చుకుంటారు. "

" అంతకంటే ముందు - రాసేటప్పుడు రచయితకి వొంటిమీద స్పృహ ఉండాలికదా ? "

" ఏమిటో....నన్ను పూర్తిగా చెప్పనిచ్చారుకారు...." ఫీలయ్యాడు మధుమూర్తి.

" ఏమిటలా నిలుచుండి పోయావ్ ? పద ." దయానిధి రామచంద్రమూర్తి భుజంమీద చేయివేసి కదిపాడు.

ఇద్దరూ—గేటు దగ్గరికి వచ్చారు.

చుట్టూ—ఆరడుగుల కంటే ఎక్కువ ఎత్తుగానే ఉండే ప్రహరీగోడ. దానిమీద అక్కడక్కడ గాజుపెంకులు కూడా కనిపిస్తున్నాయి.

కార్లు కూడా లోపలికి వెళ్ళగలిగేంత విశాలమయిన గేటు అది. అవసరమయితే తప్ప తెరచుకోదు కాబోలు. పిల్లగేటు మాత్రం కొంచెం తెరచుకున్నట్లుంది. గేటులో గేటు. కేవలం మనిషి ఒక్కడే వెళ్ళగల దొకసారికి.

పిచ్చివాళ్ళుకూడా తప్పించుకు పోతుంటారన్నమాట ! అనుకున్నాడు రామచంద్రమూర్తి ఆ ఏర్పాట్ల వెనుక అంతరార్థాన్ని గ్రహిస్తూ. అప్పుడతనికి జ్ఞాపకం వొచ్చింది. నరసరాజుగారి ' ఈ యిల్లు అమ్మబడును ' నాటికలో ప్రధాన పాత్రధారి పిచ్చాసుపత్రినుంచి తప్పించుకు వొచ్చినవాడే. అలాగే – సావిత్రి నటన శిఖరాగ్రాలందుకున్న "చివరకు మిగిలేది" ( బెంగాలీలో జాల్ సాజ్ మూలంకాబోలు) సినిమా అంతా పిచ్చాసుపత్రిలోనే. ఒక వేపు పిచ్చి. మరొక వేపు ప్రేమ....ఆ సినిమాలో. ఏతావతు – దీన్నిబట్టి తేలుతున్నదేమిటంటే – బీచి.... కాలేజి....ఆఫీసు....సినిమాహాలు....రోడ్లులాగే పిచ్చాసుపత్రిలో కూడా ప్రేమలూ కథా వస్తువులూ లభించవచ్చునని. జాగ్రత్తగా చూడాలి. పిచ్చిమీద తెలుగులో యింకా సీరియల్సు వొచ్చినట్లులేదు కనుక కొత్త సబ్జక్టే. చిన్న గేటు లోపలినుంచి – బీడీ కాలుస్తున్న గేట్ మన్ – నిలదీశాడు.

" ఎవరు మీరు ? "

" డాక్టరు విజయకు బంధువులం. "

" ఏమిటి ఋజువు ? "

" ఇదుగో " అంటూ రూపాయినోటు తీశాడు దయానిధి. వాడు – ఋజువు దొరికేసినట్లు – సెల్యూట్ కొట్టేసి....చిన్న తలుపు తెరిచాడు.

గేటు నుంచి రోడ్డు

హాస్పిటలూ వార్డులూ దూరంగా కనిపిస్తున్నాయి. గేటుకీ బిల్డింగులకీ మధ్య విశాలమయిన ప్రదేశంలో – పార్కులాగ లాన్ లూ....పెద్దపెద్ద వృక్షాలూ. అదో చిన్న అడవిలా ఉంది. మానసికారోగ్యానికి ఆహ్లాదకరమయిన వాతావరణం అవసరమని కాబోలు యిలా కట్టించారీ పిచ్చాసుపత్రిని.

మంచిదే. అమెరికాలో – వీటిని – అనాగరికంగానూ కఠినంగానూ – "పిచ్చాసుపత్రు"లనరు. " మెంటల్ హెల్త్ సర్వీస్ సెంటర్ " అంటారు.



" కొంచెం ఈ తోటలు తిరిగి చూద్దాం. మీ బంధువు.... డాక్టర్ విజయకి డ్యూటీ ముగిసేటప్పటికి ఎలాగూ ఆలస్యం ఔతుంది కద ? ఆ గదులలోనో వరండాలోనో నిరీక్షించే బదులు యీ పార్కులో చల్లగాలిమేస్తూ తిరగడం ఆరోగ్యానికి కాలక్షేపానికీ కూడా మంచిదేకదూ ? "

" అలాగే కానియ్. "

ఇద్దరూ....తూర్పు వేపుగా నడిచారు. చక్కని చెట్లు. సాయంత్రపు ఎండ. చల్లని గాలి. దూరంగా కనిపిస్తున్న సముద్రం. నిజంగా ఎంత హాయిగా ఉందిక్కడ ? మాట్లాడాలని కూడా అనిపించడంలేదు.

చాలా లోపలికి వెళ్ళిపోయారిద్దరూ....తమని తాము మరచి

" హాయ్ ! "

ఉలిక్కిపడ్డాడు రామచంద్రమూర్తి....నిశ్శబ్దంలో ఒక్కసారి వొచ్చిన కేకకి. అటువేపు చూశాడు. ఇరవ

యేళ్లుంటాయేమో ఆమెకు. చాలా అందంగా ఉంది. చిన్నపొదలా పెరిగిన తీగెల వెనుకనుంచి పరుగెత్తుకు వొచ్చింది. వొస్తూనే....అతని ప్రక్కన — భుజాలు వొరుసుకుంటూ నిలబడింది. దయానిధివేపు చూస్తూ....

"ఈయన నాకంటె ఎంత పొడవు ?" అడిగింది.

అతను విస్మయంనుంచి తేరుకుని— "మహా అయితే మూడు.... లేదా నాలుగంగుళాలు. అంతే." అన్నాడు భయపడుతూ.

"ఛీ !" ఒక్కసారతన్ని దూరంగా తోసేసిందామె. ఆ ఊపుకి రామచంద్రమూర్తి దబ్బున కిందపడేవాడే. కాని....ఒక నరమామిడి చెట్టు మాను అతన్నలా మట్టి కరవకుండా రక్షించింది—మంచివాడని జాలిపడి కాబోలు.

"నేను—ఐదూ మూడు....మరో నాలుగంటే.... ఐదూ ఏడు....ఛీ !....నువ్వు మగాడివి కావు". అసహ్యించుకుంటున్నట్లు అరిచింది రామచంద్రమూర్తిని చూస్తూ.

అతనికి మతిపోయింది. ఏమిటీమె ? చెట్టంత మొగాణ్ణి పట్టుకుని — ముఖంమీదే మొగాడు కాదంటుందేమిటి ? ఈమె కేమన్నా మతిపోయిందా ?

ఓహ్ ! ఔను. ఈమెకు మతిపోయే ఉంటుంది. ఇది—పిచ్చాసుపత్రి కదా ?....

"మరెవరు మగాడు ?" భయపడుతూనే అడిగాడు. ఆమెను మెల్లగా మాటలలోపెట్టి శాంతింపజెయ్యాలి. మనసు మరల్చాలి. లేకపోతే రక్కుతుందో గీరుతుందో ? దయానిధికంటె కొంచెం పొడవుండడంవల్ల యీ చిక్కు తన నెత్తిమీదకొచ్చి పడిందన్నమాట. పొడవు—ఎల్లవేళలా లాభదాయకం కాదన్నమాట.

అతని ప్రశ్న వినిపించుకోనట్లు మరో ప్రశ్న అడిగిందామె.

"మీకు కారుందా ?"

"లే....దు...." అన్నాడు భయపడుతూనే.

ఈలోగా దయానిధి అక్కడినుంచి జారుకున్నట్లున్నాడు.

"ఛీ !...." పురుగుని చూసినట్లు చూస్తూ అంది.

రామచంద్రమూర్తికి వొళ్ళు మండిపోతూంది. మనసులో ఆమెపట్ల మహా కోపంగా ఉంది. ఏమిటీమె ? అందంగా ఉంటే ఉండవొచ్చుగాక. పరపురుషుడనేనా లేకుండా తెగించి యీ ప్రశ్నలు వేయడమేమిటి ? జవాబులు వింటూ ఛీత్కారాలు చేయడమేమిటి అక్కడికి తానేదో గొప్పదైనట్లు. కారులేని వాళ్ళంతా అల్పులేనా ? ఆ లెక్కన మతిలేనివాళ్ళు ?

"మీపేరు రాజశేఖరమా ? కాదు కదూ ?"

"ఔను....అంటే....అదే....కాదు". తడబడ్డాడు.

"ఏమిటా పిచ్చి సమాధానం ? సరిగా చెప్పు"....

ఏకవచన ప్రయోగానికిచాలా కోపం వొచ్చింది. కాని.. ఏమీ చెయ్యలేని అసహాయస్థితి. పిచ్చికూడా కొందరికి కొన్నివేళల మంచి కవచమే కాబోలు.

"చెప్పవేం ? నీపేరు రాజశేఖరం కాదు కదూ ?"

"కాదు".

అంతే. ఆమె ముఖకవళికలు హటాత్తుగా మారిపోయాయి.

ఏడుపు వొచ్చేస్తున్నట్లుంటే ఆపుకుని..."నా పిచ్చి కాని నువ్వారడుగులు లేవు. కారులేదు. ఎస్టేట్లు లేవు. నువ్వు రాజశేఖర్ వెలా కాగలవు ? నక్కెక్కడ, నాగలోకమెక్కడ ? హుం.... ఈ జీవితమిక యింతే. రాజశేఖరం కనపడడు. రాజశేఖరం కనపడని....యీ జీవితం నా కొద్దు." అని — భోరున ఏడ్పు లంకించుకుంది.

రామచంద్రమూర్తికేం చేయాలో తోచడం లేదు. ఆమె—ఆ ఏడ్పులోనే.... "నా బుగ్గలలో వెచ్చని ఆవిర్లు....నా అరచేతులకి పట్టే చిరుచెమటలు....స్నిగ్ధమయిన నా హృదయం....అన్నీ నిష్ఫలాలు." అంది నిట్టూర్పుతూ.

బుగ్గలలోంచి వెచ్చని ఆవిర్లు.... అరచేతులకి చిరుచెమటలు....ఆరోగ్యలక్షణాలు కావు. నరాల జబ్బుకి సూచనలు. స్నిగ్ధహృదయం....పదం అందంగా ఉంది కానీ అర్థము మాత్రం శూన్యం.

" ఛో ! నా కనుల ముందునుంచి నిష్క్రమించు. నేను భరించలేను....సహించలేను.... "

బ్రతుకు జీవుడా అని పరుగు లంకించుకోబోయాడు పిచ్చిది వదిలిందంతే చాలని. అంతలోనే –

" జయంతీ ! " ....అనే పిలుపు....చెట్ల వెనుక నుంచి.

ఒక యువకుడు పరుగు పరుగున వచ్చాడు.

" జయంతీ ! ఇక్కడున్నావా ! నువ్వేమైపోయావో అని....నీకోసం ఎంత వెతుకుతున్నానో తెలుసా ! " అతను చాలా ఆత్రంగా ఆమెను సమీపించి....చేయందుకున్నాడు.

అంతలోనే దయానిధి వొచ్చాడు.

ఆమె–నవ్వింది....భారంగా. " అమ్మలేని నన్ను కన్నుల్లో పెట్టుకుని పెంచావు. నిన్ను వదిలి నేనెక్కడికి పోతాను ? "

" నువ్వెక్కడికి పోయావు దయానిధీ, నన్ను నా మానాన వొదిలి ? " "నిన్ను రక్షించడానికి—సహాయం తీసుకు వొద్దామని పరుగెత్తాను. అంతలో ఆయన.... చంద్రమోహన్ ఎదురై—మా చెల్లాయి కాని కనిపించిందా అంటూ ఆదుర్దాగా అడిగారు. టు ప్లస్ టూ యీజ్ ఫోర్... ఆయన్నిక్కడికి తీసుకొచ్చాను " అన్నాడు దయానిధి. తను స్నేహితుడికి ద్రోహం చేయలేదనీ, ప్రమాదంలో వంటరిగా వదిలెయ్యలేదనీ సూచనగా చెప్పాడు.

చంద్రమోహన్ — వీళ్ళవేపు చూస్తూ....“ ప్లీజ్ ! మీరిక్కడే ఉండండి. ఐదు నిముషాలలో వచ్చేస్తాను ". అన్నాడు సదరు జయంతి అనబడే అందాల పిచ్చి చెల్లాయిని నడిపించి తీసుకువెళ్తూ.

" ఎందుకూ ? " అడిగాడు దయానిధి—అర్థంకాక.

"కృతజ్ఞతలూ....క్షమాపణలూ చెప్పుకోవాలి. ప్లీజ్". బ్రహ్మస్త్రంతో మమ్మల్ని బంధించేసి వెళ్ళిపోయాడు.

" పాపం !....ఎంత అందమయిన అమ్మాయి ! ఆమెకి పిచ్చి ! మనిషిని చూస్తే ఎవరూ అలా అనుకోలేరు ".

## సెన్సారు

సినిమాలు శృతిమించకుండా సెన్సారు !
పత్రికలు నిజం వెలిగక్కకుండా సెన్సారు !
అన్యాయం ఎదిరించే నోటికి సెన్సారు !
కానీ !
అబద్ధపు వాగ్దానాల వర్షం కురిపించే
నాయకుల నోటికి మాత్రం లేదు సెన్సారు !

— గరిశకుర్తి రాజేంద్ర

" చదువుకుంది కూడా ! బి. ఏ. సెకండ్ క్లాస్ వాళ్ళన్నయ్య చెప్పాడు ".

" ఐతే—మధ్యలో వొచ్చిన పిచ్చన్నమాట ఏమైందో ? "

" నిన్ను—చాలా బాధ పెట్టిందా ? "

" మరీ ఎక్కువ కాదులే ". అన్నాడు రామచంద్రమూర్తి.

" అమ్మాయికి—పెళ్ళయినట్లులేదు—"

" ఔను. పెళ్ళికానట్లే ఉంది ".

అప్పుడే — చంద్రమోహన్ అక్కడికి వచ్చాడు " మీరు—రామచంద్రమూర్తిగారు కదూ ? " అన్నాడు అతన్ని చూస్తూ.

" ఔను ".

" దయానిధిగారు చెప్పారు లెండి. మా చెల్లాయి... జయంతి....మిమ్మల్ని చాలా యిబ్బంది పెట్టిందా ? "

" ఉహుం. ఏమీలేదు. మేమే—మొదట—తెలియక కంగారు పడ్డామంతే. "

" వెరీ సారీ....జరిగినదానికి ఆమె తరపునా నా తరపునా నేను క్షమాపణలు తెలుపుకుంటున్నాను.... "

" అబ్బే....అంత అవసరమేమీ లే ద ం డీ. అస లేమీ...." మొహమాట పడిపోయాడు.

" ఏమయినా—మీకు నా హృదయపూర్వక కృతజ్ఞతలు. మీరే కనుక అడ్డు తగిలి ఆమె ఆగకపోతే— నేను చాలా కంగారు పడవలసి ఉండేది. మీరు కాదన్నా.... మీకు కృతజ్ఞతలు తెలుపుకోడం నా విధి. " అన్నాడు చంద్రమోహన్.

" అసలామెకు....మీరు మరోలా అనుకోకపోతేనే చెప్పండి....ఆమెకెందుకు మతి చలించింది ? " అడిగాడు దయానిధి " అదో పెద్ద విషాద....విచిత్ర గాథ .... పదండి, గేటుకెదురుగా చిన్న హోటలుంది. కాఫీలు తాగి మాట్లాడుకుందాం. "

" ఇప్పుడు కాఫీలెందుకండీ ? "

" నేను చాలా అలసిపోయాను. " అంటూ దారి తీశాడతను.

ఆ హోటలు చిన్నదే కాని—కాఫీ బాగుంది. ఊరికి దూరంగా (హోటల్) ఉండడాన రోడ్డు పక్క కూర్చుని మాట్లాడుకుంటూ తాగడంవల్ల కాఫీకి ఎక్కువ రుచి వచ్చింది. ఉపోద్ఘాతమేమీ లేకుండా స్ట్రెయిటు (Straight) గా చరిత్రలోకి వెళ్ళాడు చంద్రశేఖర్.

ఇంట్లో బామ్మా, నేనూ జయంతీ ఉండేవాళ్ళం. బామ్మ వృద్ధురాలు....నేనెక్కువ బయట తిరిగేవాడిని. అందుచేత జయంతికి పుస్తకాలే కాలక్షేపంగా పనికొచ్చేవి. పుస్తకాలు కనుక నేనూ సందేహించలేదు. చదువుకుంటూందేతప్ప చెడిపోవడం లేదు కదా అనుకుని సంతోషించాను. నాకేం తెలుసు, ముందుంది ముసళ్ళ పండగని ?

మీరు నమ్మగలరో లేరో....జయంతి చదివే నవలలు చాలా పెద్దవి. ఒక చేత్తో మొయ్యలేనంత బరువయినవి. ఆమె తరచుగా ఒకే రైటరు పేరు చెప్పేది. తానా రైటరు అభిమాని అట. సీరియల్సుగా వొచ్చేటప్పుడు తదుపరి పత్రిక కోసం తహతహలాడి పోయేది. సీరియల్ పూర్తయ్యాక— అది పుస్తకంగా వెలువడడం తడవు, కొని తెచ్చేసి—మళ్ళీ చదివేది. ఉత్తరం, నవలా — ఓ సారి చదవడానికే తప్ప మళ్ళీ చదవడమేమిటని నేనంటే—" నీకు తెలియదన్నయ్యా ! " అనేసేది. నవలలు చదువుతున్నా—క్లాసులో మార్కులు బాగానే తెచ్చుకునేది. ఐతే – ఎప్పుడూ ఊహాలోకాల్లో తేలిపోతున్నట్లుండేది. రెండో పిలుపుకి కాని పలికేదికాదు. అవి – యౌవన లక్షణాలనుకున్నాను కాని అసహజమనీ ప్రమాదకరమనీ కొంప ముంచుతాయనీ నేననుకోలేకపోయాను.... "

" ఏమైంది ? " ఆత్రుత పట్టలేక పోయాడు దయానిధి.

" జయంతికి పెళ్ళీడు వొచ్చింది. బి. ఏ పాసూ అయింది.

బామ్మ – త్వరగా పెళ్ళి చేసెయ్యమని పోరు పెట్ట సాగింది. సంబంధాలు తెచ్చాను. పెళ్ళిచూపుల దగ్గర బయట పడింది.... "

" ఏమిటి ? "

" జయంతి – మిమ్మల్ని నిలవేసి ఏమడిగిందో, ఏం చేసిందో చెప్పండి. " తిరిగి ప్రశ్నించాడు చంద్రశేఖర్.

" నేను ఆరడగుల పొడవున్నానో లేనో .... నాకు కారుందో లేదో....నాపేరు రాజశేఖరమో కాదో...." టకటక చెప్పేశాడు రామచంద్రమూర్తి. చంద్రమోహన్ ఒక్కసారి దిగాలు పడిపోయాడు. " అంటే....జయంతి మారలేదన్న మాట .... ఆమె మెదడు బాగుపడలేదన్న మాట....అయ్యో.... "

"గొడ్డువాడు గొడ్డు చచ్చిపోయిందనేడిస్తే గొడారివాడు తోలు పోయిందనేడ్చాడనుకోకండి. పెళ్ళిచూపుల్లో.... ఏం జరిగిందో త్వరగా చెప్పండి ". కుతూహలం ఆపుకోలేనట్లడిగాడు రామచంద్రమూర్తి. చంద్రమోహన్ తేరుకుని_మొదలుపెట్టాడు మళ్ళీ.

" చూసుకుందుకు వొచ్చారు పెళ్ళికొడుకూ, తల్లీ వాళ్ళేవో అడిగాక—తనూ అడుగుతానంది జయంతి. వాళ్ళు స్పోర్టివ్‌గా "సరే" అన్నారు.

" మీ ఎ తెంత ? "

" ఐదూ_ఎనిమిది ".

" ప్చ్....మీకు కారుందా ? "

" లేదు ".

" ఛీ.... మీ పేరు ? "

" నరసింహం...." అన్నాడు పెళ్ళికొడుకు అప్పటికే సగం చచ్చి.

" గెటౌట్ !....ఏ మొహం పెట్టుకుని వచ్చావు ? నేనెవరినో తెలుసునా ? జయంతిని. నన్ను రాజశేఖరమే చేసుకోవాలి. నేను రాజశేఖరాన్నే చేసుకుంటాను ". అరిచింది.

జయంతి పిచ్చిదని ముద్ర వేశారు వాళ్ళుపోతూ. నేను స్థాణువునై పోయాను. నా చెల్లాయి....బంగారు బొమ్మ....పిచ్చిదా ? నో. కాని....ఆమెను బుజ్జగించి.... తరువాత అడిగితే.... " నీకెందు కన్నయ్యా నా పెళ్ళి చింత ? బి. ఏ. అయింది. టైపూ, షార్ట్‌హాండూ నేర్చుకుని_రాజశేఖరం దగ్గర సెక్రటరీగా చేరుతాను. అతనికి ఫ్యాక్టరీలూ .... కారూ .... ఆరడుగుల విగ్రహం. నాకు బొమ్మ ఉంది. నేనందంగా ఉంటాను. కనుక అతను నన్ను ప్రేమిస్తాడు. చివరకి నేనూ అతన్ని ప్రేమించి_పెళ్ళి చేసుకుంటాం ".

"మరో రెండు పెళ్ళిచూపుల అనంతరం – యిక్కడికి తీసుకొచ్చాను నాలుగురోజులైె. డాక్టర్ విజయ_ఏదో కాంప్లెక్సంటూ చెప్పారు ".

" ఏం చెప్పారు ? "

" కలలలో తేలించే - ఒకే తరహా నవలలు చదివీ చదివీ....ఆ నవలలలోని ఒక పాత్రతో జయంతి పూర్తిగా ఐడెంటిఫై (తాదాత్మ్యం ? ) ఐపోయి, తన జీవన సహచరుడు కూడా తన అభిమాన నవలలలోని పాత్రలాగే ఉండాలని తీవ్ర వాంఛకు లోనయిందట.... "

" అంటే ? "

" నవలలు చదివి మతి పోగొట్టుకుందని_తాత్పర్యం" కసిగా అన్నాడు చంద్రమోహన్. " మా చెల్లెలి బంగారు _)....తెలివయిన మెదడునీ పాడు చేసి....పిచ్చి దాన్ని చేసి వొదిలిన ఆ నవలలు రాసిన రైటరు కనిపిస్తే.... " పొడిచి చంపేస్తా నన్నట్లు చూశాడు.

" మీకు – మీ చెల్లెలికి....మా హృదయపూర్వక సానుభూతి. మేం వెళ్తాం. " అని శలవు తీసుకుని – దూరంగా వచ్చాక.... " దయానిధీ ! నన్ను రచయితగా పరిచయం చెయ్యక_ఎంత మేలు చేశావు ! " అన్నాడు.

రామచంద్రమూర్తి పెద్ద ప్రమాదంనుంచి తప్పించుకున్నట్లు.

" మనం హాస్పిటల్‌కి వెళ్ళొద్దూ ? " అడిగాడు దయానిధి.

" చీకటి పడిపోతూంది .... ఇవాళ వొద్దు. రేపు వెళ్దాంలే. నా మనసు బాగులేదు. ఆ బంగారు బొమ్మ.... ఆమెను పిచ్చిదాన్ని చేసినవి....నవలలు ! .... ఎంత బాధాకరం ! ....ఆ పిచ్చి తగ్గుతుందా ? ఆమె మనిషౌతుందా ? "

" విజయనడుగుదాం. ఎలాగూ య్యీ కేసు వివరాలు కావాలి. "

" దేనికీ ?" నడుస్తూనే అడిగాడు రామచంద్రమూర్తి.

" తెలుగు నవల – పాఠకులమీద చూపిన ప్రభావాన్ని సాక్ష్యాధారాలతో ఋజువు చేసేందుకు. "

" అంతేకాదు. ఎలాటి సీరియల్సూ నవలలూ రాయకూడదో రైటర్సుకికూడా కనువిప్పు కలిగిస్తుంది జయంతి కేసు. పెట్టకపోతే పోయావు, తిట్టకుతల్లీ అన్నట్లు – కీడుకి మంచి చేసినా మానినా మంచికి కీడు చేయకుండా ఉంటే అంతే చాలు తెలుగు నవల. " రా. వి. శాస్త్రి మాటలను మననం చేసుకుంటూ అన్నాడు.

" నిజమే. గుడ్‌నైట్. – రేపు కలుద్దాం. "

( సశేషం )

# నిరీక్షణ

కావిలిపాటి విజయలక్ష్మి

ఆకాశం ఏదో హెచ్చరిక చేయబోయి
ఆవులించి ఉరిమి ఊరుకున్నది
ఉర్విపై సంచరించే నరుల నడతలు చూసి
దిక్కులు, చుక్కలు, ఎక్కిరించి నవ్వుతున్నాయి
నాయకుల, వాగ్దానాలు విని చప్పట్లు చరిచే జనాన్ని
చూసి
సాయం సంధ్య వెలుగులో రంగులు పూసుకుని
కను చూపుల గమత్తుచేసే మబ్బుతునకల్లా
పార్టీలు మారి, పార్టీలు చేసుకునే,
పెద్దమనుషుల వెంట పడుతున్నారు వెఱ్ఱిజనం
వారి తులామానపు మనసు తెలుసుకోరేం ?
మనిషి పెద్ద, అతని పదవి పెద్ద.
కాని, అతని మనసు పెద్ద కాదనీ తెలుసుకోరేం ?
కారెక్కివచ్చే ఖరీదు మనుషుల, మాటల బూట
కాల్ని, చేతల కోతల్ని ?
అవినీతినీ, అక్రమాల్ని దోపిడీలనూ, మాన
భంగాల్ని, మాయా, మోసాల్ని, హత్యల్ని, అవని
భరించలేకపోతున్నది
ఆమె ఈ మనుషుల ఆగడాల్ని అరికట్టలేని
నాధుడు లేడా ! అని ప్రశ్నిస్తున్నది
క్షణానికో దుస్సంఘటన, ఆమె భయంతో
వణుకుతున్నది, విలపిస్తున్నది, కోపగిస్తున్నది
పిండిలేక పండపంటున్నది
మీ అక్రమాలనూ, అవినీతినీ, అణచివేస్తానని
రవి, జీవులమణచాలని, కనులెఱ్ఱజేసి
కసితీర్చుకుంటున్నాడు.
మనుష్యుల మనసులు మారేదెప్పుడు ?
రవి, భువి కరుణించేదెప్పుడు ?
అమాయకుల ఆశలు తీరేదెప్పుడు ?
ధర్మరాజ్యం రావాలంటె, మళ్ళీ 'ద్వాపర'
రావాలా ?
అంతవరకూ వేచి ఉండాలంటే
జీవితకాలం చాలదే! ఎన్నో జన్మకు వచ్చేను ?**

# మధుమేహం ఎందుకొస్తుంది ? దాన్ని నయం చేయవచ్చునా ?

**చక్కెర వ్యాధి**ని మధుమేహం లేదా "డయాబిటిస్" అని పిలుస్తారు. రక్తంలో చక్కెర మోతాదు ఎక్కువ కావడాన్ని ఈ వ్యాధి లక్షణంగా పేర్కొనవచ్చును. సాధారణంగా 80 నుంచి 100 మిల్లీగ్రాముల చక్కెర ప్రతి వంద మిల్లీ లీటర్ల రక్తంలో ఉంటుంది. అయితే ఈ మోతాదు తినే ఆహారాన్నిబట్టి, వయస్సునుబట్టి, లింగ భేదాన్నిబట్టి, వంశ చరిత్రనుబట్టి మారుతూ ఉంటుంది. ఎక్కువ పాళ్ళలో చక్కెర రక్తంలో గనుక చేరుకొంటే రక్తంయొక్క గాఢతలో మార్పు వస్తుంది. పర్యవసానంగా రక్తప్రసరణంలో వ్యత్యాసం గోచరిస్తుంది. శక్తి జనకాల నిర్మాణానికి తక్షణం వినియోగపడే ఈ చక్కెర విశ్లేషించబడకపోతే జీవక్రియాపరంగా స్తబ్దత అలుముకొంటుంది. ఆకలివేయకపోవడం, తిన్న ఆహారం సరిగా జీర్ణం కాకపోవడం, అలసత్వం, నీరసం-యిత్యాదులు క్రమక్రమంగా ఉద్భృతమౌతాయి. అసలు ఈ చక్కెరవ్యాధి ఎలా వస్తుందనేది తెలుసుకోవాలి.

జీవశక్తిని సమకూర్చుకోవడంలో చక్కెర అణువులు ( "గ్లూకోజ్" అణువులు ) ఎంతగానో సహకరిస్తాయి. ఈ సహకారానికి "ఇన్సులిన్" అనబడే "ప్రోటీన్" అత్యవసరము. ఈ "ప్రోటీన్" మధుర రసగ్రంధి లేదా క్లోమరస గ్రంధిలో ( "ప్యాంక్రియాస్" లో) తయారు చేయబడుతుంది. ఈ "ఇన్సులిన్" చక్కెర అణువులను శక్తి జనకాల తయారీలో వినియోగపడేటట్లు చూస్తుంది. అయితే ఏవిధంగా ఇది తన ప్రభావాన్ని చూపుతుందన్నది ఇంకా ఈనాటికీ స్పష్టంగా విశదంకాలేదు. పోనీ "ఇన్సులిన్" అయినా ఎంతో క్లిష్టతతో కూడుకొన్న జీవరసాయనిక పదార్థమా అంటే, అదీ లేదు. అది కేవలమొక "ప్రోటీన్" అణువు మాత్రమే. ఇందులో 51 "అమైనో ఆమ్లాలు" ఉంటాయని అంచనా. అవి రెండు గొలుసులుగా ఉండి, ఆ గొలుసులు రెండూ "సల్ఫర్" బంధాల ద్వారా ( "డైసల్ఫైడ్" ల ద్వారా ) కలుపబడి ఉంటాయి. రెండు చోట్ల ఈ బంధాలు ఉంటాయని వెల్లడించడం జరిగింది. మొదటి గొలుసులో 21 "అమైనో ఆమ్లాలు", రెండవ గొలుసులో 30 "అమైనో ఆమ్లాలు" ఉంటాయని పరిశీలనద్వారా తెలిసింది. ఈ "అమైనో ఆమ్లాల" అమరిక నిర్దుష్టంగా ఉండడం వల్లనేమో బహుశా ఆ "ప్రోటీన్" అణువు అంతటి విశిష్టమైన కార్యాన్ని నిర్వహిస్తోంది "ఇంటర్ఫెరాన్" లాగా !

## వైద్యవాణి

"ఇన్సులిన్" తగిన పాళ్ళలో లభ్యం కాకపోతే చక్కెర వ్యాధి వస్తుందని తేలిపోయింది. "ఇన్సులిన్" క్లోమరస గ్రంధిలోని బీటా కణాలనుంచి తయారౌతుందని వెల్లడైంది దాని క్రియాశీలత ఆల్ఫా కణాలవల్ల మరింత వేగవంతం చేయబడుతుంది. ఈ ఆల్ఫాకణాలనుంచి "ఇన్సులిన్"కు వ్యతిరేకంగా పనిచేసే "గ్లూకోగాన్" విడుదలౌతుంది. వంశపారంపర్యంగా ఈ చక్కెరవ్యాధి రావచ్చును. "ఇన్సులిన్" తయారీలో

లోపంవల్ల కూడ రావచ్చును. లేదా అంటే "ఇన్సులిన్" ఏర్పడడం పూర్తిగా స్తంభించి ఉండవచ్చును. "ఇన్సులిన్"ని బయటినుంచి అందజేసి చక్కెరవ్యాధి నుంచి తాత్కాలికంగా ఉపశమనాన్ని కలుగజేయవచ్చును. మానవుని క్లోమరసగ్రంధినుంచి బీటాకణాలను సంగ్రహించి, వాటిని "ఎస్కరీచియాకోలై" అనబడే "బ్యాక్టీరియమ్"లో ప్రవేశపెట్టి, వాటి ఉత్పత్తిని ప్రయోగాత్మకంగా పెంచి, వాటిద్వారా "ఇన్సులిన్"ను కృత్రిమంగా తయారుచేయవచ్చును. ఈ "ఇన్సులిన్"ను రోగగ్రస్తులకు నిరపాయకరంగా నిరభ్యంతరంగా వాడవచ్చును. అయితే ఇందువల్ల చక్కెరవ్యాధి అదుపు చేయబడుతుందే తప్ప పూర్తిగా నయం కావడానికి అవకాశంలేదు. కాని ఇప్పుడు "జెనెటిక్ ఇంజనీరింగ్" ప్రక్రియలవల్ల "ఇన్సులిన్" తయారీకి మూలమైన జన్యువులో మార్పులు కలుగజేసి రోగగ్రస్తుడైన మానవునిలోకూడ ఇతోధికంగా "ఇన్సులిన్" లభ్యమయ్యేటట్లు చూస్తున్నారు. ఇది నిజంగా ఎంతగానో కొనియాడవలసిన అంశం! జన్యువులో మార్పులవల్ల "అమైనో ఆమ్లాల" క్రమంలో మార్పు వస్తుంది. అంటే జన్యు పదార్థంలోని నత్రజని క్షారాల పంపిణీలో మార్పు వస్తుందన్నమాట. దీని ఫలితంగా లోపం ఉన్న "ప్రోటీన్" అణువు సరిచేయబడవచ్చు. ఒకవేళ "ఇన్సులిన్"ను నిర్దేశించే జన్యువే లేకపోయినా, జన్యువును బాహ్య పరిసరాలనుంచి దేహంలోకి ప్రవేశపెట్టే ప్రయత్నాలుకూడ జరుగుతున్నాయి! ఇవి ఎంతవరకు విజయాన్ని సాధిస్తాయో వేచిచూడాలి!

— డా॥ గుమ్మనూరు రమేష్‌బాబు

# సంస్కృతము

సంస్కృతమును భారతదేశముకన్న పాశ్చాత్య దేశములే బాగుగ గౌరవించుచున్నవి. మన పాడియావు పెరవారి ఇంట క్షీరధారలు కురియుచున్నది. అనురక్తితో వారారగించుచున్నారు. మనమా గోమాత వంక కన్నెత్తి చూడము. పట్టుమని గట్టిగా పట్టెడు పరకలు విదిలించెడి ప్రయత్నము చేయము. నీడకు రానీయము. నీళ్లు పట్టము. ఆవు శల్యావశిష్టమై బ్రతికి యున్నది. అది యొక తృప్తి. దానిని చావనీయము, జీవించుటకు మార్గములు కల్పించము. ధేనువు మాత్రము మనదేయని గొప్పలు చెప్పుకొని పొంగిపోవుచుందుము.

జర్మనీ దేశీయులకు గల దేవభాషాభక్తి ప్రత్యేక ప్రశంసార్హమైనట్టిది. 1480 సం. నాటికే వారు పంచతంత్రమును ప్రప్రథమముగా తమ భాషలోనికనువదించుకొనిరి. ప్రాథమిక పాఠశాలలో పాఠ్య గ్రంథముగ నిర్ణయించుకొనిరి. 18వ శతాబ్దము నాటికే జర్మనీ ప్రభుత్వము విశ్వవిద్యాలయములలో సంస్కృత విద్యకు ప్రత్యేక పీఠములను విధిగ నెలకొల్పవలయునని శాసించినది. 1780 లో భగవద్గీత, 1789 లో అభిజ్ఞాన శాకుంతలము పాశ్చాత్య భాషలయందనువదింపబడినవి. 1794 లో మనుధర్మ శాస్త్రమును హెచ్. టి. కోల్ బ్రూక్ ఆంగ్ల భాషలోనికనువదించి దానిని ప్రత్యేక వ్యాఖ్యానములతో వ్యాసరూపమున ప్రకటించాడు.

షోపెన్‌హాయర్ అనెడి పాశ్చాత్య పండితుడు సమగ్రమైన సంస్కృతభాషా వైదుష్యము నార్జించి 'ఉపనిషత్తే నా జీవిత సర్వస్వము' అని తన్మయత్వముతో ప్రశంసించుట గమనించదగిన విషయము. గెటీ పండితుడు శాకుంతలము, గీతగోవిందము, మేఘసందేశము మొదలైన గ్రంథముల మీద సువిస్తృతమైన పరిశ్రమ సాగించినాడు. 1849 నుండి మ్యాక్స్‌ముల్లర్ సంస్కృత భాషకు వేద విజ్ఞానమునకు చేసిన సేవ చిరస్మరణీయమైనట్టిది. ఈయన సంస్కృతం నేర్చుకొని అనేక శ్లోకములు కూడా వ్రాశారు. ఈయన ఆక్స్‌ఫర్డ్ దగ్గర ఒక ఆశ్రమమును కట్టుకొని, భారతీయ ఋషులలాగే "మోక్షమూలర్‌భట్టు" అనే పేరు పెట్టుకొని, భార్యతో సహా తన అవశేష జీవితమును భారతీయ ఉద్గ్రంథాలను చదువుకుంటూ గడిపారు. "ప్రపంచంలో నున్న భాషలలో ఒక్క సంస్కృతమునకు మాత్రమే చక్కటి శాస్త్రీయ వ్యాకరణ బద్ధమైన, నిర్దుష్టమైన పదజాలం వున్నది" అని మాక్స్‌ముల్లర్ ఎలుగెత్తి చాటడం భారతీయులకు గర్వకారణం కాదా!

శ్రీ కల్లూరి చంద్రమౌళి రచించిన 'ఆర్షసంస్కృతి' గ్రంథం నుండి

# జ్ఞానపీఠ్ అవార్డు విశేషాలు

ప్రఖ్యాతి గాంచిన విదేశీయ, దేశీయ అవార్డులు, బహుమతులు నేడు ఎన్నో వున్నాయి. అటువంటి వాటిలో అంతర్జాతీయపరంగా "నోబెల్" బహుమతికి ఎంతటి కీర్తి ప్రతిష్ఠలు ఉన్నాయో జాతీయస్థాయిలో సాహిత్య పరంగా జ్ఞానపీఠ్ అవార్డుకు కూడ అంతే కీర్తి వున్నాయి.

జ్ఞానపీఠ్ అవార్డు శాంతిప్రసాద్ జైన్ జయంతి సందర్భంగా ఏర్పరచబడింది దీనిని 1965వ సంవత్సరమునుండి ప్రతి సంవత్సరం ప్రభుత్వం గుర్తించిన 15 భారతీయ భాషలలోని విశిష్ఠ రచనలకు ఇవ్వడం జరుగుతోంది. ఈ బహుమానం పేరిట లక్ష రూపాయల నగదును, ఒక ప్రశంసాపత్రాన్ని, ఒక వాగ్దేవి ప్రతిమను అందజేస్తారు. 1981 నుండి నగదును లక్షరూపాయల నుండి లక్షన్నరకు పెంచారు.

ఇప్పటికి జ్ఞానపీఠ్ అవార్డును 1965 నుండి 1984 వరకు 20 సార్లు ఇవ్వటం జరిగింది. మొత్తం 22 మంది స్వీకరించారు. ప్రభుత్వం గుర్తించిన 15 భాషలకుగాను 12 భాషలకు ఈ అవార్డు ఇవ్వబడింది. ప్రస్తుతం 1984వ సంవత్సరానికిగాను ఈ అవార్డు మళయాళ రచయిత శ్రీ తకజి శివశంకర పిళ్ళైను వరించటం విశేషం. మళయాళ సాహిత్యకారులకు జ్ఞానపీఠ్ అవార్డు లభించటం ఇది మూడవ పర్యాయం. ఈ అవార్డు మొట్టమొదటి గ్రహీత జి. శంకరా కురూప్ కూడ మళయాళ భాషకు సంబంధించినవాడు కావటం గర్వించదగ్గ విషయమే! ఈయన వ్రాసిన " ఓ డాకు హూజల్ " అనే పుస్తకానికి అవార్డు 1965 లో లభించింది.

జ్ఞానపీఠ్ అవార్డును అందుకొన్న మొట్టమొదటి ఆంధ్రుడు శ్రీ విశ్వనాధ సత్యనారాయణ. ఈయన వ్రాసిన ప్రఖ్యాత తెలుగు గ్రంథం "శ్రీమద్రామాయణ కల్ప వృక్షం" నకు 1970 సంవత్సరములో అవార్డు లభించింది. భారతీయ సంస్కృతికి ఓ మణి దర్పణం వాల్మీకి రచించిన రామాయణం. సంస్కృత కావ్యమైన దీనిని విశ్వనాధ సత్యనారాయణగారు 35 సం॥లు కవితా తపస్సుతో రచించి చరితార్థుడైనాడు.

జ్ఞానపీఠ్ అవార్డును గ్రహించిన మొట్టమొదటి మహిళ ఆషా పూర్ణాదేవి. ఈమె బెంగాలీ రచయిత్రి. 1976 లో ఈమె వ్రాసిన " ప్రథమ ప్రతి శ్రుతి " అనే బెంగాలీ నవలకు ఈ అవార్డు వచ్చింది.

1982 వ సంవత్సరంలో మహాదేవి వర్మకు జ్ఞానపీఠ్ అవార్డు లభించింది. " యమ " అనే హిందీ పుస్తకానికి అవార్డు లభించటం గమనార్హం. ఇంతవరకు మొత్తం నాలుగుసార్లు హిందీభాషకు అవార్డు వచ్చింది.

1983 లో ఈ బహుమతి కన్నడ సాహిత్యంలో గొప్ప పునర్వికాస రచయితలలో ఒకరైన శ్రీ మస్తి వెంకటేశ్ అయ్యంగారిని వరించింది. ఈయన రచించిన "చికవీర రాజేంద్ర" అనే నవలకు అవార్డు లభించింది.

1967 మరియు 1973 సంవత్సరాలలో ఈ అవార్డును ఇద్దరిద్దరు పంచుకోవటం జరిగింది. 1967 లో శ్రీ పుట్టప్ప వ్రాసిన "రామాయణ దర్శనం" (కన్నడం) అనే పుస్తకానికి, ఉమాశంకర్ జోషి రచించిన "నిష్హీత్" (గుజరాతీ) అనే గ్రంథానికి ఈ అవార్డు లభించింది. 1973 వ సంవత్సములో శ్రీ దత్తాత్రేయ రామచంద్ర బెంద్రీ విరచితమైన "నాకుతంతి" (కన్నడం) అనే పద్య సంకలనానికి, శ్రీ గోపీనాథ్ మొహంతి రచించిన " మాతి మటల్" అనే ఒరియా నవలకు ఈ బహుమతి లభించింది.

వీరేగాక, 1966 లో తారాశంకర్ బందోపాధ్యాయ, 1968 లో సుమిత్రానంద్ పంత్, 1969 లో గోరక్‌పూరి. 1971 లో బిష్ణుదే, 1972 లో రామ్‌ధారీ సింగ్ దినకర్, 1974 లో ఖండేకర్, 1975 లో అఖిలానందమ్, 1977 లో శివరామ కారంత్, 1978 లో వాడ్ సయ్యాన్, 1979 లో బి. భట్టాచార్య, 1980 లో పాట్ ఖంట్, 1981 లో అమృతా ప్రీతమ్ ఈ అవార్డును పొందిన ప్రముఖ రచయితలు.

వ్యక్తులలోని నిగూఢ జ్ఞాననిధిని వెలికి తీసే అత్యంత ప్రతిష్ఠాకరమైన జ్ఞానపీఠ్ అవార్డ్ 1985 వ సంవత్సరం ఎవరిని వరించనున్నదో? మరో విశ్వనాధను వరిస్తే గర్వించని ఆంధ్రుడు ఉంటాడా?

— చేగిరెడ్డి సత్యనారాయణరెడ్డి

# దేవీతత్త్వము

మల్లాప్రగడ శ్రీరంగారావు

" అకారాది క్షకారాన్తాం। ఆద్యామానంద రూపిణీం
అఖిలార్థ ప్రదాం దేవీం। నమామి జగదంబికాం ॥ "

సర్వ వాఙ్మయ స్వరూపిణియై త్రిమూర్తులకు, త్రిశక్తులకు మూలమైన ఆదిస్వరూపయై అడిగిన వారికి అఖిలార్థములను (ఖిలము కాని శాశ్వత పదమును) అనుగ్రహించు జగన్మాతకు నమస్సులని మనమందరం దేవీ నవరాత్రి మహోత్సవములందైనా భావించుట మన కర్తవ్యంగా గుర్తింపవలసి వున్నది.

ప్రపంచంలో ప్రతి మానవుడు శాశ్వత సుఖాన్ని కోరతాడు గాని అశాశ్వతమైన క్షణిక సుఖాన్ని బుద్ధిమంతుడైన వాడెవ్వడూ కోరడు. ఈ సుఖదుఃఖాలు, రాగద్వేషాలు, జనన మరణాలు, వృద్ధిక్షయాలు యీ ద్వంద్వాలను దాటి శాశ్వతానందమును పొందాలంటే పరాశక్తి పాదములనే ఆశ్రయించాలని హయగ్రీవుడు అగస్త్యునికి బోధిస్తాడు.

" శివశ్శక్త్యాయుక్తో భవతి శక్తః ప్రభవితుం
నచే దేవం దేవః నఖలు కుశలః స్పందితుమపి
అతస్త్వా మారాధ్యాం హరిహర విరించాదిభిరపి
ప్రణంతుం స్తోతుం వా కథ మ కృత పుణ్యః ప్రభవతి "

జగద్గురువులైన శంకర భగవత్పాదులు 'సౌందర్యలహరి' గ్రంథంలో శక్తితో కూడినపుడే శివుడు కూడ స్పందించగలడు. లేనిచో ఏ పనియు చేయలేడు. అందువల్లనే బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు ఆ శక్తినే ఆరాధిస్తారు. అట్టి పరాశక్తికి నమస్కారం చేయాలన్నా, ఆ దేవిని స్తోత్రం చేయాలన్నా ఎంతో పుణ్యం చేసుకున్న వానికే సాధ్యంకాని ఇతరులకు ఆ భాగ్యం లభింపదన్నారు. పోతన మహాకవి కూడ త్రిశక్తులకు ఆ పరాశక్తియే మూలమని —

" అమ్మల గన్న యమ్మ ముగురమ్మల మూలపుటమ్మ చాల పె
ద్దమ్మ, సురారులమ్మ కడుపారడిపుచ్చినయమ్మ, తన్నులో
నమ్మిన వేల్పుటమ్మల మనంబుల నుండెడి యమ్మ, దుర్గ, మా
యమ్మ కృపాబ్ధి యిచ్చుత మహత్త్వ కవిత్వ పటుత్వ సంపదల్ "

లక్ష్మి, సరస్వతి, పార్వతి అనే ముగ్గురమ్మలకు అమ్మయని, చాల పెద్దమ్మయని ప్రశంసించాడు. అట్టి దేవిని ఆశ్వయుజ మాసంలో శుద్ధ పాడ్యమి నుండి దశమి వరకు నవరాత్రి దీక్షతో పూజిస్తూ వుంటారు వాటినే శరన్నవరాత్రము లంటారు.

మన భారతదేశంలో వసంత నవరాత్రములు, శరన్నవరాత్రములు యీ 18 రోజులు దేవీ పూజలు చేస్తుండుట అనాది నుండి వస్తున్న ఆచారం. మన ఆంధ్ర ప్రాంతంలో వసంత నవరాత్రములందు శ్రీ రామచంద్రుని పూజించే

ఆచారం వుంది కాని ఉత్తర భారతంలో చైత్రశుద్ధ పాడ్యమి నుండి నవమి వరకు గల వసంత నవరాత్రులలో పరాశక్తి పూజనే చేస్తూ వుంటారు.

'శ్రీకృష్ణపి శ్యామలాదేవీ శ్రీ రామో లలితాంబికా' అను సూక్తిననుసరించి శ్రీరామచంద్రుని లలితాదేవిగా భావించి ఆరాధించు పద్ధతి ఉన్నది. రామలీలా మహోత్సవములని పేరు మాత్రమేగాని జరిగే పూజలు దేవీ సంబంధములే.

" ద్వావృతూ యమదంష్ట్రాఖ్యౌ నూనం సర్వజనేషువై
శరద్వసన్త నామానౌ దుర్గమౌ ప్రాణి నా మిహ
తస్మాత్తత్ర ప్రకర్తవ్యం చండికా పూజనం బుధైః
చైత్రే ఆశ్వినే శుభే మాసే భక్తి పూర్వం ప్రయత్నతః "

చైత్ర మాసంలో మెదటి తొమ్మిది రోజులు, ఆశ్వయుజంలో మొదటి 9 రోజులు యీ 18 రోజులు మృత్యు దేవత నోరు తెరచుకొని ప్రాణికోటిని భక్షించుటకు వీర విహారం చేస్తుందని, ఆ మృత్యువునుండి బైటపడుటకే వసంత, శరత్తులలో నవరాత్రులందు దేవిని పూజించాలని దేవీ భాగవతంలో వ్యాసమహర్షి అంటాడు.

దుష్ట రాక్షస సంహారం కొరకు దేవతలందరూ ప్రార్థిస్తే పరాశక్తి ఆవిర్భవించింది. నిరాకారయైన ఆ శక్తి భక్తులను రక్షించటానికి, దుష్టులను శిక్షించటానికి సాకారయై దేవతలకు ప్రత్యక్షమైంది. అలా ప్రత్యక్షమైన ఆ శక్తి సరస్వతిగా, దుర్గగా, మహాలక్ష్మిగా మనందరిచేత ఆరాధింపబడుతూ వుంటుంది. ఆ శక్తియే మొట్టమొదటిది. ఆద్యా శక్తి (ఆదిశక్తి) అంటారు. ఆమె అనుగ్రహం చేతనే త్రిమూర్తులు తమ తమ కృత్యములను నెరవేరుస్తున్నారు.

బ్రహ్మ సృష్టిస్తాడని, విష్ణువు పోషిస్తాడని, రుద్రుడు సంహరిస్తాడని పురాణాల్లో కనిపిస్తుంది. కాని ఆ మూడు పనులు మూలశక్తి ఆ జగన్మాత వల్లనే ఆ ముగ్గురు చేయగల్గుతున్నారని ఆది శంకరులు చెప్తూ ఆమె అనుగ్రహం లేక పోతే ఆ ముగ్గురు మూర్తులు ఏమీ చేయలేరనికూడ —

" బ్రహ్మ జగత్ సృజతి పాలయతీందిరేశః
శంభుర్వినాశయతి దేవి తవ ప్రభావైః
నస్యాత్కృపాయది తవ ప్రకట ప్రభా వే
న స్యుః కథంచిదపితే నిజ కార్య దక్షాః "

అనే శ్లోకంలో నిరూపించారు.

ఈ దేవీ నవరాత్రులలో ఆ శక్తి ఒక్కొక్క రోజున ఒక్కొక్క రూపం ధరించి ఆయా రాక్షసులను సంహరిస్తూ వుంటుంది. ఆశ్వయుజ శుద్ధ సప్తమినాడు సరస్వతీదేవిని, అష్టమినాడు దుర్గాదేవిని, నవమినాడు మహాలక్ష్మిని పూజించి దశమినాడు ఆ దేవిని పరాశక్తి స్వరూప అయిన శ్రీ లలితా పరాభట్టారిగా, రాజరాజేశ్వరిగ, భువనేశ్వరిగ పూజించుట లోకాచారం. వెలుపల వున్న రాక్షసులను సంహరించి దేవతలకు విజయం కలిగించినందున విజయదశమినాడు విజయోత్సాహంతో ఆ దేవిని ఆరాధిస్తారు.

'బ్రహ్మోపేంద్ర మహేంద్రాది దేవ సంస్తుతవైభవా' అని లలితా సహస్ర నామావళిలో ఆ పరాశక్తిని బ్రహ్మేంద్రాదులు స్తోత్రం చేస్తారని వివరింపబడింది.

భండాసురుడు మహిషాసురుడు చండాసురుడు వంటి అనేక రాక్షసులను ఆ దేవి సంహరించిందని బ్రహ్మాండ పురాణం, దేవీ భాగవతంలో వివరింపబడింది. మనలో కూడ భండ, మహిషాది రాక్షసులున్నారు. కడుపునిండా తిని, కంటినిండా నిద్రపోతూ యీ ప్రపంచంలో స్వేచ్ఛగా ప్రవర్తించే సోమరిపోతు వంటివాడు భండుడు. దున్నపోతు వంటి పశు స్వభావమే మహిషుడు. అలాంటి భావాలు మనలో ప్రవేశిస్తే మనం భండ, మహిషులకు లొంగిపోయి మన జీవితాలను నాశనం చేసుకుంటాం. అలా కాకుండ మన లోపలవున్న సూక్ష్మ శక్తిని సాధన ద్వారా అభ్యాసబలంతో స్థూల శక్తిగా చేయగలిగిననాడు ఆ శక్తియే మనలోని ఆ రాక్షసులను సంహరించి మనకు విజయాన్నిచ్చి ప్రశాంత జీవనాన్ని ప్రసాదిస్తుంది. ఇది మన కథ - అందుకే ఆ పరాశక్తిని వెలుపల కాళ్ళు చేతులు, కన్నులు మొదలగు అవయవాలతో కూడిన స్వరూపంగా మనం ఆరాధించినా లోపల వున్న శక్తిని కూడ విజృంభింప చేసుకొనడమే యీ నవరాత్ర పూజా విధానంలోని ఆంతర్యం.

> " సృష్ట్వాఖిలం జగదిదం సదసత్స్వరూపం । శక్త్యా స్వయా త్రిగుణయా పరిపాతి విశ్వం
> సంహృత్యకల్పసమయే రమతే తథైకా । తాం సర్వ విశ్వ జననీం మనసా స్మరామి "

అని దేవీ భాగవతంలో అంటారు. సద సదాత్మకమైన యీ జగత్తును సృష్టించి తాను మూడు శక్తులను లక్ష్మి సరస్వతి కాళి రూపాలను సృష్టించి సృష్టి స్థితి లయములను జరిపించుచు ఈ విశ్వమునకంతా జననియై ప్రళయకాలంలో ఒకే రూపంగా వుండే ఆ పరాశక్తికి నమస్కారమని విష్ణువు ప్రార్థిస్తాడు.

ఈ దేవీ నవరాత్రులలో నవకుమారీపూజ, సుహాసినీపూజ చేయుట ఆచారం. ఆశ్వయుజ శుద్ధ పాడ్యమినుండి నవమి వరకు 2 సంవత్సరాలవయస్సు నుండి 10 సం వయస్సు గల కన్యలను ఒక్కొక్క రోజు ఒక్కొక్క దేవతగా ఆరాధించాలి.

కుమారిక, త్రిమూర్తి, కల్యాణి, రోహిణి, కాలిక, చండిక, శాంభవి, దుర్గా, సుభద్ర అనే పేర్లతో వరుసగా 9 రోజులు ఆ కుమారీలను పరాశక్తిగ భావించి పూజించాలి. అలా ఆరాధించిన వారికి అనంతమైన యైశ్వర్యం, ఆయురారోగ్యాలు, సుఖశాంతులు, శత్రునాశన శక్తి లభిస్తాయని శాస్త్రం చెప్పుతున్నది.

'సువాసిన్యర్చన ప్రీతా' అమ్మవారి పేరుతో సువాసినులను పూజిస్తే ఆ దేవికి చాల సంతోషం. సువాసినులచేత పూజింపబడితే ఆ పరాశక్తికి పరమానందం అని హయగ్రీవుడంటారు. బాలా, తరుణా, వృద్ధా అన్ని పేర్లు అంబికకు చెందినవే. ఆమె వయోవస్థావివర్జిత. అట్టి దేవిని ఆరాధించిన ఇహపరలోక సుఖాలు పొందగలరని —

> " యత్రాస్తి భోగోనహితత్ర మోక్షః యత్రాస్తి మోక్షోన హితత్ర భోగః
> శ్రీ దేవతా సేవ వతత్పరాణాం భోగశ్చ మోక్షశ్చ కరస్థ ఏవ "

త్రిపుర తాపనీయోపనిషత్ సూక్తి.

> " తల్లులకెల్ల తల్లియగు తల్లిని గావగ లేక ఎందరో
> తల్లుల గర్భకోశముల తా ముదయించుచు జన్మజన్మలన్
> తల్లుల సంతరింతురిల తత్వమెరుంగక ఓ పరాత్పరీ
> తల్లివి నీవె యన్న యిక తల్లులు లేరుకదా జగమ్ముననన్ "

కావున అందరు ఆ జగన్మాత నారాధించి పునర్జన్మలేని శాశ్వత స్థితిని పొందగలరని దేవీభాగవతం ప్రబోధిస్తున్నది. ★

కారణం అక్కడ పడున్నది చందన కాదు! చందనకి అలంకరణ చెయ్యడానికి నియమించిన యువతి ?

"మరి చందనేదీ ?" పిచ్చిగా అరిచాడు రాఘవ. మురళి తెల్లబోయాడు.

చందన కోసం అంతా కంగారుగా వెతికారు. అయితే ఆమె ఎక్కడా కనిపించలేదు. గౌరీ పూజదగ్గరున్న పసుపు కుంకుమలు వెక్కిరించినట్టు అలాగే వున్నాయి.




"బాత్‌రూమ్‌లో చూడండి." అన్నారెవరో అక్కడా చూశారు. కానీ చందన లేదు.

కసిగా జుట్టు పీక్కున్నాడు రాఘవ.

"రాఘవా ! ఇది చూడు !" చిన్నగా అరిచాడు మురళి. చివ్వున తల తిప్పి చూశాడు రాఘవ. అక్కడ డ్రెస్సింగ్ టేబిల్ మీద ఓ నీలిరంగు కాయితం అందర్నీ ఆకర్షించింది. గభాల్న దాన్నందుకున్నాడు రాఘవ. అందులో ఇలా వుంది.

"చందన మీద ఆశ వదులుకోండి! ఆమెని నేను తీసి కెళ్తున్నాను. భస్మాసురుడు !"

ముఖాలు చూసుకున్నారు రాఘవ, మురళి.

మురళి, రాఘవ కలిసి ఆ ప్రాంతాలంతా వెతికారు చందనకోసం. అయితే ఎక్కడా చందన లేదు. విషయం హోటలంతా తెలిసిపోయి జనం పోగయ్యారు.

మేనేజరు కూడా కంగారుగా వచ్చాడు. ఈలోగా పడి పోయిన యువతి లేచింది. ఆమెని ఓ గదిలోకి చేర్చి డాక్టర్‌కి చూపించారు. ఏదో ఘాటు మందు వాసన

చూపించడం మూలంగా స్పృహ కోల్పోయిందనీ మరేం ప్రమాదం కాదనీ, చెప్పి ఓ ఇంజక్షన్ చేసి వెళ్ళిపోయాడు డాక్టరు.

ఆమెకి స్పృహ వచ్చిందని తెలిసి మురళి, రాఘవ, మేనేజర్ మళ్ళీ అక్కడికి పరిగెత్తారు.

ఆమె పడుకునే వుంది.

"జ్యోతీ! ...." మెల్లగా పిల్చాడు మేనేజర్.

"ఊఁ ?" మెల్లగా కళ్ళు తెరిచిందామె.

"ఏం జరిగింది ?" ఆతృతగా అడిగాడు రాఘవ.

ఆమె లేచి కూర్చుంది.

గుర్తు తెచ్చుకుంటున్నట్టు క్షణం మౌనంగా ఉండి పోయింది.

"ఎవరు. - నీకు స్పృహ తప్పించింది ?" మళ్ళీ అడిగాడు మేనేజర్ ఆమె మర్యాదగా లేవబోతుంటే వారించి.

"ఎవరో ఓ ముసుగు మనిషి :"

"ముసుగు మనిషా ?" తృళ్ళి పడ్డారంతా.

"ఊఁ !" నేను ఆ అమ్మాయికి పూల జడేస్తు న్నాను. ఆమె కబుర్లు చెప్తోంది. ఆమె వేసే అమాయక ప్రశ్నలకి నవ్వుకుంటూ జవాబులిస్తున్నాను. ఇంతలో వున్నట్టుండి .... కెవ్వున అరిచి పడిపోయిందామె. నేను కంగారుగా ఆమెను లేవనెత్తి -

"ఏం జరిగింది ?" అంటూండగానే వెనక అడుగుల చప్పుడయింది. వెనక్కి తిరిగి చూశాను. అతి చేరువగా ఓ ముసుగు మనిషి !

అతన్ని చూసే ఆమె పడిపోయిందని గ్రహించేలోగా గభాల్న ఆ వ్యక్తి నా దగ్గరికొచ్చి నా ముక్కు దగ్గర కర్చీఫ్ పెట్టి అదిమాడు. అంతే ! మత్తులాంటిది ఆవహించేసింది. అరవాలనుకున్న నా ప్రయత్నం ఫలించ కుండానే నేల కూలిపోయాను. మళ్ళీ ఇంతకు ముందే మెలకువ వచ్చింది;" అంది జ్యోతి. ఆమె మొహంలో ఇంకా భీతి కనిపిస్తోంది.

అందరూ బైటకొచ్చేశారు.

"పోలీసు కంప్లయింట్ ఇవ్వండి. " అన్నారెవరో చూశాడు మేనేజర్.

"ఒద్దులెండి ! .... మేం తెలుసుకుంటాం" అన్నాడు రాఘవ. తేలిగ్గా వూపిరి తీసుకున్న మేనేజర్ -

"సరే సరే ! నేనొస్తాను, .... ఏదైనా అవసరం అయితే ఫోన్ చెయ్యండి :" అని జ్యోతితో -

"కాసేపు రెస్ట్ తీసుకో !" అని వెళ్ళిపోయాడు.

తమ సూట్‌లోకొచ్చారు రాఘవ, మురళి.

"రాఘవా ! .... ఇంతకీ ఆ ముసుగు వీరుడెవ్వరై వుంటాడు ?" నీరసంగా కూలబడుతూ అన్నాడు మురళి.

"అదే ఆలోచిస్తున్నాను. ఇంతలో ఈ హోటల్ పరిసరాలు దాటడం కష్టం ! .... రావడమూ నిమిషాల్లో అయ్యే పనీ కాదు ! .... పోనీ ఈ హోటల్లో వున్నవాళ్లే మాయం చేసుంటారంటావా ?" అన్నాడు రాఘవ.

"మనం వచ్చిందీ ఇప్పుడేగా ! .... అలాంటప్పుడు ఇక్కడ ఓ కన్నె వుందనీ, ముసుగు ధరించి మరీ రావా లనీ ఎవరికి తెలుస్తుందీ ? ...."

"నిజమేఁ" : అన్నట్టు తల పంకించాడు మురళి.

ఇద్దరూ ఆలోచనలో పడ్డారు.

"రాఘవా !" హటాత్తుగా అరిచినట్టు అన్నాడు మురళి.

"ఏమిఁటి ?"

"ఇది ఆ జయంత్‌గాడి పనే ! ....

"జయంతా ? ...." కళ్ళు చిట్లించాడు రాఘవ.

"అవును ! .... మనం ఇక్కడికొస్తామనీ .... నువ్వు చందనని పెళ్ళి చేసుకుంటావనీ అతనికొక్కడికే తెలియాలి !"

"నిజమే ! .... కానీ .... అతను మనతో రాలేదు..."

"అందుకే నాకు మరీ అనుమానం : మనకన్న ముందే వచ్చి దాక్కుని వుంటాడు. చందన తనని తిరివేఁ

సిందనీ, ఇంక లాభం లేదనీ ఈ పని చేసుంటాడు ! ” అన్నాడు మురళి ఆవేశంగా.

“ఎస్, యు ఆర్ కరెక్టు ! ....” చటుక్కున లేచి నిల్చున్నాడు రాఘవ. అతని కళ్లు ఎర్రగా చింత నిప్పుల్లా వున్నాయి.

“ ఎక్కడికి తీసికెళ్లుంటాడు ? ” అన్నాడు మురళి.

“ చెప్తాను ; ముందు బయల్దేరు ! ”

“ ఎక్కడికి ? ”

“ గెస్టుహౌస్‌కి ! .... ”

“ ఎందుకు ”

“ అతని బట్టలు అవీ కూడా అక్కడే వున్నాయి. రిసెప్షన్‌లో ‘ కీ ’ తీసుకుని ఈ శ్రీనగర్‌నించే మకాం ఎత్తెయ్యొచ్చు ! త్వరగా పద ! ....”

ఇద్దరూ గబగబా బైటకొచ్చి టాక్సీ ఎక్కారు యడ్రస్ చెప్పి

“ బట్టలకోసం మళ్ళీ వస్తాడా ? ” అనుమానంగా అన్నాడు మురళి.

“మనం తనని అనుమానిస్తాం అనుకుని వుండడు !...”

“ కానీ .... భస్మాసురుడు అన్న పేరుందిగా .... ”

“ చూద్దాం ; ” మెల్లగా అన్నాడు రాఘవ. ఆ అనుమానం అతనికీ వుంది. అయితే అనుమానించదగ్గ వ్యక్తి జయంతే కాబట్టి అలా అనుకున్నాడు.

“నిజంగా భస్మాసురుడు అని ఎందుకు రాశాడు? ”.... మెల్లగా అన్నాడు మురళి.

“ భస్మాసురుడు బెదిరించి రాసిన వుత్తరం అతనూ చదివాడుగా !....” ఏదో ఆలోచిస్తూ అన్నాడు రాఘవ.

అతను ఎటూ తేల్చుకోలేక పోతున్నాడు. టాక్సీ గమ్యం చేరుకుంది. అయితే వాళ్ళు ఆశించినట్టు జయంత్ అక్కడికి రాలేదు. వాళ్ళకి మరింత నీరసం ఆవహించేసింది.

“ ఇప్పుడేం చేద్దాం ? ” అన్నాడు మురళి.

రాఘవ మాట్లాడలేదు.

జరిగిన కథ

“అంకుల్ మీరిన్నాళ్ళు ఎక్కడికి వెళ్ళారు? వీళ్ళందరూ నన్నిక్కడ బంధించారు. ఎటూ పోనివ్వరు. నాకు అమ్మానాన్నని చూడాలని ఉంది” జాలిగా అన్నాడు బాబు సారధినిచూసి. “ అమ్మా నాన్న దగ్గరికి తీసికెళ్తానని ఈ అంకుల్ చెప్పారు. అన్నీ అబద్ధాలే” అన్నాడు రాఘవని చూపిస్తూ.

ఎంతసేపయినా రాఘవ కానీ జయంత్ గానీ రాకపోవటంతో విసుగ్గా ఉంది చందనకు. ఇంతలో రాఘవ ‘ చందనా ’ అంటూ చేతిలో కొన్ని ప్యాకెట్స్‌తో లోపలికి వచ్చాడు. “ త్వరగా పద ! బాబుకు, నీకు బట్టలు తెచ్చాను ” అన్నాడు. వీళ్ళిద్దరు బయలుదేరే సమయానికి జయంత్ వచ్చాడు. తమతో రావద్దని రాఘవ ఖచ్చితంగా జయంత్‌తో చెప్పాడు. హోటల్లో పెళ్ళి ఏర్పాట్లు చేసారు. మురళి రాఘవలు బట్టలు మార్చుకొని వస్తానన్న చందన ఎంతకి రాకపోవడంతో ఆమె గదిలోకి వెళ్ళాడు రాఘవ. అక్కడి దృశ్యం చూసి కొయ్యబారిపొయ్యాడు.

( ఏమిటది ? ఇక చదవండి )

“ పోనీ పోలీసు కంప్లెయింట్ చేద్దాం” మళ్ళీ మురళే అన్నాడు.

“ ఏమని ? ”

“ గాలి మార్పుకోసం తీసుకొచ్చిన మతిస్థిరంలేని ఓ అమ్మాయిని ఎవరో కిడ్నాప్ చేశారని ! మన తరఫున మాట్లాడ్డానికి డాక్టరుకూడా వుంది ! ”

" నిజమేఁ! కానీ ఆ పిచ్చిదాన్ని నమ్మి మనం పోలీసు కంప్లెయింట్ ఇస్తే ! "వినోద్! వినోద్ !" అని వాడికి సపోర్ట్ చేసి మనకే ఎసరు తేవచ్చు! అయినా ఇప్పుడు మనం చేసిన పన్లకి పోలీసుల ఛాయలకి వెళ్ళడంకూడా క్షేమంకాదు! "

" మరేం చేద్దాం ? " దిగులుగా అన్నాడు మురళి.

" చూద్దాం ! "

* * * * *

చందనని అనుమానం వున్నచోటల్లా వెతికారు రాఘవ, మురళి. కానీ....ఆమె జాడలేదు. వుత్తరాలమీద వుత్తరాలు రాస్తున్నారు శాంతారామ్, దేవకి.

నిన్న వచ్చిన వుత్తరంలో ఫోన్‌లో మాట్లాడమని రాశాడు శాంతారామ్. రాఘవకేం పాలు పోలేదు. చివరికి ఓ ఆలోచన తట్టి మెల్లగా డాక్టరింటికేసి బయల్దేరాడు మురళిని తీసుకొని.

ఆవిడ ఇంట్లోనే వుంది. వాళ్ళిద్దర్నీ చూసి "ఏవిఁటి?" అన్నట్టు మొహం చిట్లించింది. మెల్లగా నవ్వాడు రాఘవ.

" మళ్ళీ ఎందుకొచ్చారు ? " అందావిడ తీక్షణంగా.

" చందన వచ్చిందేమో అని........" నసిగాడు మురళి.

" అదేవిఁటి ? చందన మా ఇంటికొస్తానని చెప్పిందా ? " ఆశ్చర్యంగా అడిగింది డాక్టర్.

" ఉఁహూఁ !....ఊరికే...."

" అదికాదు డాక్టర్ ! చందనని ఎవరో ఎత్తుకు పోయారు ! " అన్నాడు రాఘవ.

" వ్వాట్ ? " తృళ్ళిపడిందావిడ.

" అవును డాక్టర్ ! జయంత్ అని ఓ వెధవ దాపురించాడు ! చందన తండ్రివైపు దూరపు చుట్టంట ! వాడికి మా చందన ఆస్తిమీద కన్ను పడింది. వెంట తిరగడం మొదలెట్టాడు! అతనే చందనని మాయం చేసుంటాడు ?" అన్నాడు రాఘవ.

" చందన పొమ్మన్లేదూ ? "

" నా మొహం ! ఈ పిచ్చిది వినోద్, వినోద్ అంటూ అతన్నొదలడంలేదు ! "

" మరింకేం....ఆ పిల్ల కలవరించే వినోద్ దొరికాడన్నమాట ! " తృప్తిగా అంది డాక్టర్.

" వినోదా నా మొహమా ! ఆ వినోద్ అన్నవాణ్ణి సృష్టించింది నేనేగా ! నా మాట నమ్మి నిజంగానే వినోద్ అనే వాడెవడో వున్నాడనీ తనని ప్రేమించి గుళ్ళో పెళ్ళి చేసుకున్నాడనీ, అతనివల్ల ఓ బాబు పుట్టాడనీ వూహించుకొని నిజంగా పిచ్చిదైపోయింది ! " విసుగ్గా అన్నాడు రాఘవ.

" అలా కావాలనేగా మీ ఆశ ? "

" అవుననుకోండి ! కానీ మధ్యలో అంతా రసాభాస అయిందే ! "

" హుఁ ! నిజంగా చందన మంచిపిల్ల ! ఆమె వచ్చింది ఏదో కడుపునెప్పికి, గాలిమార్పుకి ! దాన్నొదిలేసి కథల్లి పాపం ! నిక్షేపంలాంటి పిల్లని పిచ్చిదాన్ని చేసేశారు ! ఆ పాపంలో నేనూ భాగం పంచుకున్నాను ! " భారంగా అంది డాక్టర్.

" అయిందేదో అయిపోయింది డాక్టర్ ! మేం కోరిన విధంగా బోట్ హౌస్ దగ్గరికొచ్చి, చందనని పలకరించి, ఆమెకి చెప్పవలసింది నమ్మకంగా చెప్పి తెలివిగా తప్పించుకున్న మీకు మరోసారి కృతజ్ఞతలు చెప్పుకుంటున్నాను. మీవల్ల నాకెంతో మేలు జరిగింది. చిన్నతనంనించి కన్న కలలు ఫలించబోతున్నాయి ! అందుకే మీరు అడిగిందాని కన్నా ఎక్కువ డబ్బు ఇచ్చాను ? " తృప్తిగా అన్నాడు రాఘవ.

ఓసారి చుట్టూ కంగారుగా చూసి

" ఇంతకీ ఇప్పుడేవఁటారు ? " అంది డాక్టర్ విసుగ్గా.

" మరేంలేదు ! మీరు మరో చిన్న హెల్ప్ చెయ్యాలి ! "

" ఏవిఁటి ? "

" చందన ఎక్కడుందో వెతుకుతున్నాం. మా బావ చందన కోసం ఉత్తరాలమీద ఉత్తరాలు రాస్తున్నాడు. రేపో ఎల్లుండో బయల్దేరి వచ్చినా రావచ్చు. అందుకే మీరు మా వాళ్ళకి ఫోన్‌చేసి చందన కులాసాగానే వుంది. మరో పదిరోజులు వుంచుకుని పంపుతానని చెప్పండి ! " అన్నాడు రాఘవ.

" ఇంక నా వల్ల కాదు ! తప్పో, ఒప్పో జరిగి పోయింది. ఇంక మీదట మాత్రం ఇలాంటి వెధవ పన్లు చచ్చినా చెయ్యను !" కచ్చితంగా అంది డాక్టర్.

ఎన్నో విధాల బతిమాలారు రాఘవ, మురళీ. అయినా ఆవిడ ఒప్పుకోలేదు.

" అయితే.... మేం జైలుకి వెళ్ళడం మీ కిష్టమా ? " గంభీరంగా అన్నాడు రాఘవ.

" అది నాకనవసరం ! "

" అవసరమే ! .... ఎందుకంటే .... మాతోపాటు మీరూ రావల్సొస్తుంది జైలుకి ! " వ్యంగ్యంగా అన్నాడు.

" వాడ్డూయు మీన్ ? " కోపంగా అంది డాక్టర్.

" అవును ! మా పాపంలో మీకూ భాగం వుందని మీరే ఒప్పుకున్నారుగా ? .... అసలు మీ మాటలవల్లే మా చందన పిచ్చిదై పోయిందని మీకూ తెలుసు ! .... ఇది .... నలుగురికీ తెలిసి పోయిందనుకోండి ! మీ బతుకు బజార్న పడుతుంది ! ఏమంటారు ?...." సిగిరెట్ వెలిగించి విలాసంగా పొగ వదులుతూ అన్నాడు రాఘవ.

డాక్టర్ మొహం పాలిపోయింది.

" ఇదంతా మీ అక్కగారికి తెలుసా ? " అంది తడారిన గొంతుతో.

" ఎక్కడా ! చందనకి దాదాపు ఇక్కడే మతి పోయింది. పిచ్చిదాని మాటలు ఎవరు నమ్ముతారు చెప్తే మాత్రం ? "

" థాంక్ గాడ్ ! " గుండెలమీద చెయేసుకుంది డాక్టర్. చేసినప్పుడు లేని భయం ఇప్పుడు తరివి తరివి కొడుతోంది.

" ప్లీజ్ ! ఇంక నన్నొదిలెయ్యండి ! " అంది రెండు చేతులూ జోడిస్తూ.

రాఘవ పెద్దగా నవ్వాడు.

" పరవాలేదు ! ఇందులో మీకొచ్చిన భయం ఏం లేదు - చెయ్యండి ఫోన్ !" రిసీవర్ తీసి చేతికందించాడు రాఘవ.

* * *

వారం రోజులు గడిచిపోయింది. జయంత్ జాడగానీ, చందన జాడ గానీ లేదు. తెచ్చిన డబ్బంతా కర్పూరంలా అయిపోయింది.

పిచ్చి పట్టేలా వుంది రాఘవకి.

"రాఘవా !" మెల్లగా పిల్చాడు మురళి.

పరధ్యానంగా వున్న రాఘవ పలకలేదు.

" రాఘవా ! ఏ లోకంలో వున్నావ్ ? " రాస్త విసుగ్గా అన్నాడు మురళి. అతనికలా రాఘవకి అనుచరుడుగా వుండడం చాలా చిరాగ్గా వుంది.

" చందన లోకంలో ! " అతని చిరాకుని గమనించని రాఘవ నవ్వుతూ అన్నాడు.

" ఊం ! నువ్విక్కడ చందనని వూహా లోకాల్లో చూస్తూండు ! ఆ జయంత్ నిజ జీవితంలో ఆమెతో హాయి అనుభవిస్తాడు ! " కసిగా అన్నాడు మురళి.

" మురళీ ! " కోపంగా అన్నాడు రాఘవ.

" లేకపోతే ఏవిఁటి రాఘవా ! మనం ఇక్కడుండి ఏం చేస్తున్నట్టు ?....చందన గురించి మీ వాళ్ళకి ఏం చెప్తావ్ ? బాబు సంగతేవిఁటి ? "

" బాబుని సారధి తీసుకెళ్ళిపోయుంటాడు ! "

" మరి....చందన సంగతి ? "

" ఏం చెయ్యను ? "

" నేను చెప్పింది వింటావా ? "

" ఏవిఁటి ? " ఆత్రంగా అడిగాడు రాఘవ.

" మనం వెంటనే వెళ్ళిపోదాం ! "

" వెళ్ళి ? "

" చందనని జయంత్ తీసికెళ్ళిపోయాడని చెప్పి నమ్మిద్దాం ! "

రాఘవ కళ్ళల్లోకి కొత్తవెలుగు వచ్చింది. వెంటనే నీరసం కూడా వచ్చింది.

" మరి చందన....? " అన్నాడు.

" చూద్దాం ! ఆ జయంతేం కోటీశ్వరుడేం కాదు ! వాణ్ణి కొనడం పెద్దకష్టం కాదు !....నువ్వేం ఆలోచించకు! చందన నీది !...." అన్నాడు మురళి.

రాఘవ మొహం దివ్వెలా వెలిగిపోయింది.

" అయితే వెళ్ళి పోదాం ! " అన్నాడు.

*   *   *   *   *

బాబు హైదరాబాదు వచ్చికూడా చాలా రోజులైంది. నాన్నని చూపిస్తానని తీసుకొచ్చి ఇక్కడ వదేసి వెళ్ళి పోయిన అంకుల్‌మీద చాలా కోపం వచ్చింది.

" ఈసారి గట్టిగా అడిగెయ్యాలి ! " అని నిర్ణయించు కున్నాడు. అయితే సారధి రావడమేలేదు. నౌకర్లే అతని క్కావల్సినవన్నీ చూస్తున్నారు. బాబుకి మొదటిలా భయం వెయ్యకపోయినా తండ్రిమీద బెంగగా వుంది. తండ్రిని, ఇంటిని తల్చుకుంటే దుఃఖం తన్నుకొస్తోంది.

" అసలు తను నాన్నకి చెప్పకుండా రావడం పొరపా టయింది. అంతా ఆ అంకులే చేశాడు ! " అనుకున్నాడు కోపంగా.

అలా వాడు అనుకోవడం అప్పటికి వందోసారి.

" ఈసారి అన్నం తిన్నని బెదిరించాలి ! అప్పుడు కచ్చితంగా నాన్న దగ్గరికి తీసికెళ్తారు అంకుల్ " అను కున్నాడు బాబు.

తను అన్నం తినకపోతే అందరూ బాధపడతారని పించింది వాడి చిన్న మనసుకి. అందుకే ఆరోజు అన్నం తెచ్చిన అతనితో—

" నాకు అన్నం వద్దు ! " అన్నాడు కోపంగా.

" ఏం ? ఆకలిగా లేదా ? " అన్నాడతను.

" ఆకలిగానే వుంది ! "

" మరి ?...."

" మా నాన్న దగ్గరికి తీసికెళ్ళేదాకా అన్నం తిన్ను! అన్నమే కాదు ! ఏం తిన్ను ! " బెదిరించాడు బాబు. అతను నవ్వాడు.

" ఎందుకు నవ్వుతావ్ ? నేను నిజంగా తిన్ను ! "

" సరే అయితే నేను వెళ్తాను ! " వెనుతిరిగాడతను. బాబు బిత్తరపోయాడు. నాన్న దగ్గరికి తీసికెళ్ళడం అటుంచి తినమని బతిమాలనైనా బతిమాలలేదని చిన్న బుచ్చుకున్నాడు.

! "

" ఏవిఁటి ? " వెనుతిరిగాడతను.

" నాకు మా నాన్న కావాలి ! " దుఃఖాన్ని ఆపు కుంటూ అన్నాడు బాబు. అతను తిరిగొచ్చి—

" భోంచెయ్యి !....త్వరలో మీ నాన్నగారి దగ్గరికెళ్ళి పోదువుగాని ! " నమ్మకంగా అన్నాడు.

" నిజమేనా ? "

" నిజం ! "

" ఒట్టూ ? " పెద్దకళ్ళలో చిన్న అనుమానం.

" ఒట్టు "

" అయితే అన్నం తీసుకురా ! " సంతోషంగా టేబిల్ ముందు కూర్చున్నాడు బాబు. ప్లేటుపెట్టి అన్నం వడ్డించా డతను.

*   *   *   *   *

రాఘవ, మురళి ఊళ్ళో అడుగు పెట్టారు. ఎందుకో ఇద్దరికీ ఒణుకుగా వుంది.

" నాకేదో భయంగా వుంది రాఘవా ! " మెల్లగా అన్నాడు మురళి.

" ఎందుకు ? " బింకంగా అన్నాడు రాఘవ.

" అదే .... చందన .... "

" అదంతా నేను చూసుకుంటాను నువ్వు చూస్తూండు!"

ఇద్దరూ ఆటోలో ఇల్లు చేరుకున్నారు. వొచ్చే సరికి శాంతారామ్‌గారు హాల్లో కూర్చుని ఉన్నారు. వాళ్ళని చూడగానే చటుక్కున లేచి –

"దేవీ! .... రాఘవా వాళ్ళొచ్చారు!" అన్నాడు గట్టిగా. ఒక్క పరుగులో వచ్చి పడిందావిడ. నౌకర్లందరూ చుట్టు ముట్టి –

"అమ్మాయిగారేరీ? కులాసాగా ఉన్నారా?" అంటూ ప్రశ్నల వర్షం కురిపించారు. రాఘవ కాళ్ళల్లోంచి ఒణుకులాంటిది బయల్దేరింది. తెచ్చిపెట్టుకున్న ధైర్యం ఆమడ దూరం పారిపోయింది.

"చందనేదీ?...." అన్నాడు శాంతారామ్. "అవును! బెంగగా వుంది. అయినా ఇన్నాళ్ళేం చేశార్రా!" అంది వీధిలోకి చూస్తూ.

"చందన .... అదే .... జయంత్ ...." తడబడి పోయాడు మురళి.

"సరిగ్గా చెప్పండి. ఏం జరిగింది?" తీక్షణంగా అన్నాడు శాంతారామ్.

"కాదు బావా! చందనకి బానే వుంది; .... కానీ.... జయంత్ మనకి ద్రోహం చేశాడు!"

"ఏం చేశాడురా?" అతన్ని కుదిపేసింది దేవకి.

"మాకు తెలియకుండా గుళ్ళో పెళ్ళి చేసుకుని చందనని ఎక్కడికో తీసికెళ్ళిపోయాడు. మేం ఎంత ఆపుదామన్నా కుదరలేదు. పైగా చందన కూడా మా ఇష్టం! అని ఎదురుతిరిగింది" గబగబా అన్నాడు మురళి.

నిర్ఘాంత పోయారు శాంతారామ్, భార్య.

"మాకెందుకు చెప్పలేదురా" అరిచింది దేవకి.

"ఏం చెప్పం అక్కయ్యా! .... మాకు తెలిస్తేగా ఎవరో చెప్పారు, పెళ్లి జరిగిపోయిందని. వెళ్ళి చందనని అడిగితే రాను పొమ్మంది! అయినా నువ్వేం బాధపడకక్కా! ఎక్కడున్నా దాన్ని తీసుకొచ్చి నీకప్పచెప్పే బాధ్యత నాది!" ధైర్యం చెప్పాడు రాఘవ.



"అది కాదురా! జయంత్ పెళ్ళి చేసుకున్నాడుగా పోనీ. సరిగ్గా చూసుకుంటాడంటావా?" దిగులుగా అంది.

"ఛ!....అదీ ఓ పెళ్ళేనా.... రేపీపాటికి వాడి దగ్గర్నించి చందనని తెచ్చి ఆ మూడు ముళ్ళూ వేసేయ్యనూ .... కాకపోతే మీ సహకారం నాకుండాలి!" ఉత్సాహంగా అన్నాడు రాఘవ.

"కానీ దాని చరిత్ర........"

"అంటే?"

"అదే చందనకి కొడుకు పుట్టడం....!

"ఛ!...అదంతా కట్టుకథని మనకి తెలియదా అక్కయ్యా!" పెద్దగా నవ్వాడతను.

"లేదు రాఘవా! అదంతా నిజమే!"

"అక్కయ్యా!" త్రుళ్ళిపడ్డాడు రాఘవ.

## సత్యమే ఊపిరి

పండిట్ దీనదయాళ్ ఉపాధ్యాయకు సత్యమే ఊపిరి. వ్యక్తిగత జీవితంలో సత్యపథం నుండి అణుమాత్రమైనా ప్రక్కకు తొలగడం ఆయనకు సుతరామూ ఇష్టం ఉండేది కాదు. ఒకరోజు ఉదయం దీనదయాళ్‌జీ నానాజీదేశ్‌ముఖ్‌తో కలసి బజారుకు వెళ్లి రెండు పావలాల కూరలు కొన్నారు. తిరిగి వస్తుండగా దారి మధ్యలో దీనదయాళ్‌జీ ఠక్కున ఆగిపోయారు జేబులో చేయి పెట్టుకొని " నానా ! పొరపాటు జరిగిపోయింది. బజారుకు వెళ్లే ముందు నా జేబులో నాలుగు పావలాలున్నాయి. అందులో ఒకటి చెల్లనిది. ఇప్పుడు నా జేబులో చూస్తే రెండు మంచి పావలాలున్నాయి. కనుక నేను ఒక చెల్లని పావలా కూరలమ్మిన ముసలమ్మకు యిచ్చి వుంటాను. పోదాం పద, ఆమెకు మంచి పావలా యిచ్చి వద్దాం " అని అంటారు. వారిద్దరూ కలిసి కూరలమ్మిన ముసలమ్మ వద్దకు వెళ్లతారు. జరిగిన సంగతి ఆమెతో చెబుతారు. " మీ చెల్లని పావలా కోసం ఇపుడు ఎవరు వెతుకుతారయ్యా ? " అని ఆ కూరలమ్మి అంటుంది. అప్పుడు దీనదయాళ్‌జీ స్వయంగా ఆ ముసలమ్మ ముందున్న చిల్లర డబ్బులు వెతికి, తన చెల్లని పావలా వెలికి తీసి, దానికిబదులు మంచి పావలా యిస్తున్నప్పుడు ఆయన ముఖంలో సంతృప్తి తాండవిస్తుంది. ఆయన నిజాయితీకి ఆ ముసలమ్మ విస్తుపోతుంది. " ఆ దేవుడు నిన్ను చల్లగా చూడాలి నాయనా ! " అని ఆ ముసలమ్మ అంటుంది. మహనీయులు చిన్న చిన్న విషయాలలో సహితం ఎంత జాగరూకతతో ఉంటారో ఈ ఉదంతం వలన మనకు తేటతెల్లమవుతున్నది.

" అవున్రా ! అదంతా ఓ పెద్ద కథ ! చాలారోజుల క్రితం చందనకి ఆరోగ్యం బావుండలేదని డాక్టర్‌కి చూపిస్తే పిడుగులాంటి వార్త చెప్పిందా డాక్టర్. చందన గర్భవతి అని. మాకు మతిపోయింది. చందనని గద్దించి అడిగితే, తనొకతన్ని ప్రేమించి ఏదో ఆలయంలో పెళ్ళి చేసుకున్నామని చెప్పింది. నెత్తీ నోరు బాదుకుని అతని కోసం వెతికాం ! పత్తాలేడు

తప్పనిసరిగా శ్రీనగర్ తీసికెళ్ళాం. నీకు తెలుసుగా తరచు మేం అక్కడికెళ్ళి కొన్నాళ్ళు గడిపొస్తామని ! " కళ్ళు తుడుచుకుంటూ చెప్పింది దేవకి.

రాఘవ, మురళి నిర్ఘాంతపోయి చూస్తున్నారు. రాఘవ కాళ్ళు చిత్రంగా ఒణుకుతున్నాయి. "తను స్వార్థం కోసం నోటికొచ్చినట్లల్లా వాగిన వాగుడు నిజమైందా ? .... " అన్న విస్మయం అతని మొహంలో స్పష్టంగా కనిపిస్తోంది.

" అయితే.... చందనకి మతిస్థిరం........ "

" అవును....ఏడేళ్ళ వయసులోనే దానికి మతిస్థిరం తప్పింది. ఎవరికీ తెలియకుండా జాగ్రత్త పడ్డాం !.... కొన్నాళ్ళు బావుండేది. కొన్నాళ్ళు మూడీగా వుండేది. అ మూడీగా వున్నప్పుడే ఎవరో దాన్ని మోసంచేసి ఈ స్థితికి తెచ్చారు ! .... ఇప్పుడెక్కడుందో ! ఏమో ! " భారంగా అందావిడ.

నీరసంగా కూలబడిపోయాడు రాఘవ. చిత్రంగా చూస్తూండి పోయాడు మురళి.

" ఏం మావయ్యా ! షాగ్గావుంది కదూ ? " వెనక నించి వినిపించిన స్వరానికి ఉలిక్కిపడి చివ్వున వెనక్కి తిరిగి చూశారు రాఘవ, మురళి.

గది గుమ్మంలో అదోరకంగా నవ్వుతున్న చందన ! జయంత్ !

( సశేషం )

# సాంస్కృతిక పునరుజ్జీవనం ఆర్. యస్. యస్. లక్ష్యం

భారత వర్షమే నశిస్తే ప్రపంచంలో ఆధ్యాత్మికతయే నశిస్తుంది. నైతికత నశించిపోతుంది. మధురము, ఆత్మీయము నైన ధర్మానుభూతి నశిస్తుంది; ఆదర్శం లుప్తమై పోతుంది. వీటి స్థానంలో కామ ,భోగములు స్త్రీ పురుషలకు దైవములవుతాయి. ధనమే వీటికి పురోహితుడు. వంచన, బలాత్కారము–వీటికి పూజలు.. మానవాత్మయే బలిపశువు అవుతుంది. అది జరుగరాదు —— అన్నారు స్వామి వివేకానంద.

ఉత్తిష్ఠత ! జాగ్రత ! ప్రాప్యవరాన్నిబోధత ! – అని ఆయన నినదించారు.

ధార్మిక పథంలో హిందూదేశం పయనించాలని ఆయన అభిలషించారు. బలమే జీవనం; బలహీనతే మరణం అని ఆయన వ్రాకుచ్చారు.

> 1925లో స్థాపించబడింది–ఆర్.యస్.యస్. రేపటి విజయదశమికి 60 సంవత్సరాల యవ్వనాన్ని నింపుకుంటుంది – ఆ సంస్థ. ఆ సందర్భంగా ఈ చిరు వ్యాసాన్ని ప్రచురిస్తున్నాం.
>
> — సం.

రవీంద్ర కవీంద్రుడు స్వతంత్ర భారత దేశాన్ని గురించి కమ్మటి కలలను గాంచారు. స్వతంత్రభారత పౌరులు సత్యపు లోతులను తరచగలరని, విజ్ఞానపు అంచులను చేరగలరని ఆయన ఊహించారు. వివేచనాజ్ఞానమనే ఝరి మౌఢ్యపు ఎడారులలో యింకి పోరాదని ఆయన అభిలషించారు.

సాంస్కృతిక పునరుజ్జీవనం కొరకై పరితపించారు– మహర్షి అరవిందులు. భౌతిక సంపదలు, విజ్ఞానపువిలసనాలు చేయి చేయి కలుపుకొని, పరమ వైభవమైన స్థితి వైపుగా ఈ జాతి పయనించాలని ఆయన ఆశించారు.

ఆర్. యస్. కె. మూర్తి

ఇట్టి మహనీయులు మరెందరో ఈ జాతిని గురించి, ఈ దేశాన్ని గురించి గాంచిన స్వప్నాలకు, పెంచుకున్న అభిలాషలకు "ఆచరణా పథకం"గా ఈ దేశంలో పని చేస్తున్న ఒకానొక సాంస్కృతిక సంస్థ రాష్ట్రీయ స్వయం సేవక సంఘం. ఆర్. యస్. యస్. అని ఇంగ్లీషులో అందరికీ పరిచితమైన ఈ సంస్థ స్థాపించబడి రేపటి విజయదశమికి 60 వత్సరాలు అవుతుంది. 1925 సంవత్సరపు విజయదశమినాడు ఐదుగురే ఐదుగురితో స్థాపించబడింది– రాష్ట్రీయ స్వయంసేవక సంఘం. ఈనాడు ఆసేతు హిమాచల పర్యంతం సంఘశాఖలున్నాయి. దేశవ్యాప్తంగా లక్షలాదిమంది స్వయం సేవకులున్నారు. సామాజికరంగంలో ప్రధానంగా, వివిధ రంగాలలో విశేషంగా .... సాంస్కృతిక పునరుజ్జీవనం లక్ష్యంగా ఈ స్వయం సేవకులు విర్విరామకృషి సల్పుతూ ఉన్నారు. సాధించినది చూచి పొంగి పోకుండా, సాధించవలసినది బృహత్తరమైనదని కృంగి పోకుండా, మన జీవితకాలం

## నాటి, నేటి భారతవర్షం

ఆర్. యస్. యస్. సంస్థాపకులు డా. హెడ్గేవార్ వద్ద రెండు కాగితపు అట్టతో తయారైన విసనకర్రలు వుండేవి. ఒక విసనకర్ర మీద ఛత్రపతి శివాజీ చిత్రం, రెండవదానిపై 'బాలగంధర్వ' అను స్త్రీ వేష ధారి చిత్రం వుండేది. వాటిని చూచి ఒక మిత్రుడు "తమవద్ద శివాజీ చిత్రం వున్న విసనకర్ర ఉండటం ఉచితమే. ఆ స్త్రీ చిత్రం ఉన్న విసనకర్ర ఉంచడానికి మీరెలా అంగీక రించారు ?" అని ప్రశ్నించాడు. డాక్టర్జీ సహజ ధోరణిలో "దీనిలో నా ఉద్దేశం ఏమిటో తమరే ఊహించి చెప్పండి" అని అన్నారు. ఆ మిత్రునికేమీ తోచక 'తమరే చెప్పండి' అని అర్థించాడు. అప్పుడు డాక్టర్‌జీ "మన దేశంలో రెండు రకాల పరిస్థితులను తెలియబరచే చిత్రాలు నా ముందెప్పుడూ వుండాలనే తలంపుతో ఈ రెండు విసనకర్ర లను ఉంచాను" అని చెబుతూ శివాజీ చిత్రం గల విసనకర్రను చూపిస్తూ "ఇది మూడు వందల సంవత్సరాలనాటి గౌరవోపేతమైన భారతదేశం. ఈ రెండవది (స్త్రీమూర్తిగల విసనకర్రను చూపిస్తూ) నేటి భారతవర్షం" అని చమత్కరించారు.

లోనే పరమ వైభవస్థితిని చూడాలనే పరికాంక్షతో పని చేస్తూ ఉంటారు. రాష్ట్రీయ స్వయంసేవక సంఘం స్వయం సేవకులు. సులభమైన కార్యాచరణ మార్గం వీరిది. అనల్పమైనది వీరు సాధిస్తూ ఉంటారు

## డాక్టర్జీ

సంఘ సంస్థాపకులు, డాక్టరు కేశవరాం బలిరాం హెడ్గె వార్. నిరుపేదగా జన్మించారు. అయితేనేం వారి గుండెను నింపిన ఆలోచనలు విలువైనవి. వారి మనస్సున వీచిన ఊహలు ఉన్నతమైనవి. బ్రిటీషు దాస్యంనుంచి విముక్తు లం కావటమే లక్ష్యంగా దేశమంతా పనిచేస్తున్న రోజు లలో మనజాతికి పట్టిన క్లైబ్యంనుండి విముక్తుల మవటం మన లక్ష్యం కావాలన్న ద్రష్ట ఆయన. రోగంకంటె రోగ నిదానం ముఖ్యమన్న జాతి వైద్యులాయన శారీరక, మానసిక శిక్షణలతో మనిషిని సంస్కారాలతో నింపి, సంస్కారయుతుడైన మనిషి పనిముట్టుగా పరమ వైభవ స్థితిని ఈ జాతి అందుకోగలదని వివరించిన వివేకి ఆయన. ఐదుగురితో ఆరంభమైన ఆర్. యస్. యస్ నేడొక విరాట్ స్వరూపంగా జాతికి గౌరవప్రద మవుతున్నదంటే అందుకు ఒక ప్రధాన కారణం–డాక్టర్జీ ప్రవచించిన సిద్ధాంతమే. సిద్ధాంతం, ఆచరణ, కార్యకర్తలు–అన్నీ అపురూపంగానే ఉండేవిధంగా సంఘాన్ని తీర్చిదిద్దిన ఒక సామాజికశిల్పి–డాక్టరు హెడ్గెవార్‌జీ.

## రాష్ట్రీయ స్వయంసేవక సంఘం

పేరులోనే పెన్నిధిని నిలుపుకున్న సంస్థ–ఆర్. యస్ యస్. మనది హిందూరాష్ట్రం. (రాష్ట్ర అన్న సంస్కృత పదానికి తెలుగులో సమాన వాచకం జాతి.) ఇక్కడి వారందరూ హిందువులు. హిందూత్వం ఒక ఆరాధన విధానం మాత్రమే కాదు. అంతకు మించి అదొక జీవనవిధానం. అదొక ధర్మం. ధర్మం ఈ జాతిని శాసించింది. హిందూ జాతి ఆత్మ హిందూ ధర్మంలో ఉన్నది. హేతు వా ద ం మన సమాజానికి పునాది రాయి. ధర్మం మారదు. బాహ్య ప్రకటనలు మారవచ్చు. మార్చుకోవచ్చు. మౌఢ్యపు ఎడారులలో వివే చనా ఝురులు ఇంకి పోనక్కరలేదు. హిందువులు అకర్మ ణ్యులు కారు. గీతాబోధనను అర్థం చేసుకొనని వారుకాదు. కర్మ పరాయణులు వారు. సంపదలను వారు కామించరు.

విసర్జించరు. నిష్కామంగా కృషి చేయటం వారికి తెలుసు. జ్ఞాన, సంపదలను సమానంగానే వారు వినియోగించుకుంటారు - ఆధ్యాత్మిక ముక్తి సాధనకై.

ఇట్టి రాష్ట్రీయులైన హిందువులు స్వయం సేవకులుగా-తమంతట తాముగా సేవకై ముందుకొచ్చే త్యాగ నిరతులుగా — కలిసి పనిచేసే సంఘం రాష్ట్రీయ స్వయం సేవక సంఘం. స్వయంసేవకులంటే వాలంటీర్లు కాదు. వారి సేవలను అందుకునేది భరతమాత మాత్రమే. వారు అందించేది నిస్వార్థమైన సేవలను మాత్రమే.

సదాసేవకై సంసిద్ధం(Ready for Selfless Service) అని ఆర్. యస్. యస్. అన్న ఆంగ్లపు అక్షరాలకు అర్థం చెప్పారు స్వామీజీ.

## ఆర్. యస్. యస్. సాధించినదేమిటి ?

1977లో దివిసీమలో ఉప్పెన వచ్చింది. ప్రకృతి విలయాన్ని సృష్టించింది. జాతియావత్తు కదిలిపోయింది. సహాయం తరలివచ్చింది. దాంతోపాటే పుట్టుకొచ్చారు నిహితస్వార్థులు. మంచిని వమ్ము చేసే మనుష్యులు. ఎవరిని నమ్మాలి ? ఎవరిద్వారా సహాయం ఆపన్నులకు అందగలదు ?

అన్నప్పుడు వారికి విశ్వాస కేంద్రంగా నిలిచింది ఆర్. యస్. యస్. వందలాదిగా శవాలను ఖననంచేసి, విశిష్ట లనిపించుకున్నారు స్వయం సేవకులు. ఇంకా ఎన్నోరకాలుగా వారు ఆపన్నులను ఆదుకున్నారు-తమ ధర్మంగా సోదరుని నిండుమనస్సుతో.

అత్యయిక పరిస్థితి విధించబడింది. పౌరులహక్కులు రద్దు చేయబడినై. దేశమే ఒక పెద్ద జైలుగా మారి పోయింది. కోట్లాదిమంది జాతీయులకీ జైలునుండి విముక్తి కలిగించగలందులకై షుమారొక లక్షమంది స్వయం సేవకులు ప్రభుత్వపు జైళ్ళకు నవ్వుతూ వెళ్ళారు. ఎమర్జెన్సీలో అరెస్టయినదే లక్షాఇరవై వేలమంది ! నవ్వుతూ వెళ్ళిన లక్షమంది నవ్వుతూనే వెలికివచ్చారు - మరోసారి స్వాతంత్ర్యం సంపాదించుకున్న దేశంలోకి అత్యయిక పరిస్థితి రద్దయిన స్థితిలోనికి జాతిపై అత్యాచారం జరుప దలచుకున్న వారు శిక్షించబడిన సురక్షితమైన పరిస్థితులలోకి.

ఇట్లా ఎన్నో సందర్భాలలో, ఎన్నో విధాలుగా తమ సేవలను అందజేస్తుంటారు స్వయం సేవకులు. అయితే సంఘంలో వీరికి లభ్యమయ్యే శిక్షణ శవాలను ఖననం చేయటంలోనూ కాదు, జైళ్ళకు వెళ్ళటంలోనూ కాదు. సంఘశాఖ సర్వింగ్‌స్కూలూ కాదు ; సబర్మతి సత్యాగ్రహ ఆశ్రమమూ కాదు.

శాఖలో స్వయం సేవకులు పొందే శిక్షణ ఒక్కటే. పదుగురి శ్రేయస్సును కాంక్షించి, దానిని అందుకోడానికై అవసరమైన త్యాగాలను చేయగల సంస్కారాలను అందుకొనటం మాత్రమే వారి శిక్షణ.



ప్రదర్శనలిస్తున్న స్వయం సేవకులు

## ఆత్మవిశ్వాసం – అహంభావము

"ఆత్మవిశ్వాసం చాలా ఆవశ్యకం, కాని అహంభావాన్ని దరిచేరనీయకూడదు. ఆత్మవిశ్వాసం పేరిట అహంకారానికి లొంగిపోవడం కాని, అహంభావం వుండరాదంటూ ఆత్మవిశ్వాసమే కోల్పోవడం కాని ఎన్నటికీ జరుగకూడదు. ప్రతిపనీ ఆత్మవిశ్వాసంతో చేయాలి. ఆత్మ విశ్వాసంతో 'మా కార్యక్రమం సర్వశ్రేష్ఠమైనది, దోషరహితమైనది, స్వయంపూర్ణమైనది. దీనినే అందరూ అంగీకరిస్తారు' అని మనం ప్రకటించవచ్చు. కాని ఈ ఆత్మ విశ్వాసంవల్ల మిగతా ప్రపంచం ఒట్టి పనికిమాలినదనీ, ఏమీ చేయలేదనీ మనసులో కూడా భావించరాదు ఆ 'భావం' కలిగినవానిని 'అహంభావం' ఆవరించినట్లేనని చెప్పవలసి వసుంది."

– గురూజీ గోళ్వాల్కర్

సుశిక్షితులై, క్రమశిక్షణా యుతులై, కాగల ఈ కార్యాన్ని గంధర్వులకు వదలివేయక, తామే పూనుకొని నిర్వహించే సంసిద్ధత వారికి లభ్యమయ్యే సంస్కారాలలో ఒక్కటి.

వారి లక్ష్యం-తమ జీవితకాలంలోనే పరమ వైభవ స్థితిని చూడగలగటం.

సాంస్కృతిక పునరుజ్జీవనం తర్వాత మాత్రమే ఇది సాధ్యమవుతుందనేది సంఘపు విశ్వాసం.

## ఆర్. యస్. యస్. - రాజకీయాలు

చివరగా ఒక్క మాట. సంఘానికి రాజకీయముల యందు అనురక్తి లేదు. అనురక్తి కలిగి ఉంటానంటే సంఘాన్ని వద్దనేవారు ఎవరూ ఉండరు. కాని రాజకీయములు జాతిజీవనంలో ఒక రంగం మాత్రమే ననేది సంఘం విశ్వాసం. అవసరమైన దానిని మించి ప్రాధాన్యత ఆ రంగం సంతరించుకుంటున్నదని, అట్లా ప్రాధాన్యతలోకి వస్తున్న రంగం నానా కంగాళీగా ఉంటున్నదనేది మాత్రమే సంఘపు ఆవేదన. ఒక జీవనరంగంగా తగు మాత్రపు ప్రాధాన్యతగా తనవంతు పునరుజ్జీవన కార్యాన్ని ఆ రంగంకూడ చేయగలిగితే బాగుంటుందని, అట్టి దిశగా కృషి జరగాలనేది సంఘంయొక్క అభిలాష.

రాజకీయ నాయకత్వమే దేశానికి, జాతికి నాయకత్వం వహించడం సంస్కారులెవ్వరూ హర్షించరు అదొక పాకుడు రాళ్ళ వ్యవహారం. ఎంతటివారూ అడుగులు సరిగా వేయలేని రంగమది. అట్టి రంగంనుండే అన్ని రంగాల నాయకత్వం బయలుదేరటం తలక్రిందులు వ్యవహారమని ఎవరైనా అంగీకరించాలి. "ఈజాతికి నాయకత్వం వహించింది – ఋషులు" అంటారు స్వామి వివేకానంద. ఋషి జీవనులు - విద్యా, వైజ్ఞానిక, ఆర్థికాది వివిధ రంగాలలో నిష్ణాతులైనవారు నిర్దుష్టులైనవారు జాతికి నాయకులుగా రూపొందే మంచిరోజు వచ్చేవరకు, మనకు మంచి నాయకత్వం లేనట్లేనని అందరూ ఒప్పుకుంటారు. అట్టి నాయకత్వాన్ని ఈ జాతికి అందించాలని కోరే సాంస్కృతిక ఉద్యమం – ఆర్. యస్. యస్.

అయితే రాచకీయులకి ఆర్. యస్. యస్. పై అనురక్తో, విరక్తో, ఆగ్రహమో, అనుగ్రహమో ఉండటంలో ఆశ్చర్యం లేదు. బలీయము, క్రమశిక్షణా యుతమునైన సంఘం తమ చెప్పుచేతల్లో ఉండాలని ఏ రాజకీయ నాయకుడైనా ఆశిస్తారు. సంఘం అట్లా ఉండదు కాబట్టి, ఆ నాయకులు అందని పళ్లు పులుపని ఊరుకోరు. ఆకాశంపై ఉమ్మివేయడానికై వారు ఉద్యమిస్తారు.

రాచకీయుల సహజ బలహీనత అది.

సంఘం ఇట్టి బలహీనతలను చూచి జాలిపడుతుంది. నిర్లక్ష్యం, ఎగతాళి, ప్రతిఘటనల తర్వాత అనురాగం, గౌరవం తమ యందు జాతికి ఏర్పడుతున్న దనేది నేటి ఆర్. యస్. యస్. విశ్వాసం.

జాతి ఆర్ యస్ యస్ నందు పెంచుకుంటున్న ఆశలవల్లరి అదొక విశేషంగా చెప్పుకోదగిన అంశం-మరోసారి-

# విద్యా విధానంలో మౌలిక మార్పులు రావాలి!

విద్యా విధానంలో మార్పులు చేయాలనే ఆలోచన చాలా కాలంగా కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల ఆలోచనలో వుంది. ఇటీవల కాలంలో జరిగిన కొన్ని మార్పులవల్ల విద్యా ప్రమాణాలు కొరవడినాయనే విమర్శలు కూడా వున్నాయి. మారుతున్న కాలానికి అనుగుణంగా, విద్యార్థుల మానసిక స్థాయికి అందుబాటులో ఉన్నత ప్రమాణాలను సాధించటం ఎలా ? అనేది ప్రస్తుతం ఎదురవుతున్న ప్రశ్న. ఈ విషయంలో తర్జన భర్జనలు జరుగుతున్నాయి. ఇందుకోసం తీసుకోవలసిన చర్యలేమిటనేది ప్రభుత్వాన్ని వేధిస్తున్న సమస్యే కాదు, ప్రజలకు అవసరమైన సమస్యకూడా. పలు రంగాలలోని ప్రముఖుల అభిప్రాయాలను ఇప్పటికే సేకరించటం జరుగుతోంది. కృష్ణాజిల్లా తెలుగునాడు అధ్యాపక సంఘం ఆధ్వర్యమున 1985 ఆగష్టు 18వ తేదీన ఉయ్యూరులోని జిల్లా పరిషత్ హైస్కూలులో జరిగిన సదస్సులో రాజకీయ నాయకులు, విద్యాశాఖాధికారులు, ఉపాధ్యాయ ప్రతినిధులు, జర్నలిస్టులు ప్రసంగించారు. వక్తలు తమ తమ అభిప్రాయాలను నిష్కర్షగా వ్యక్తం చేశారు. వక్తలు వ్యక్తీకరించిన విధంగా మార్పులు జరిగి, ఆచరణలోకి వస్తే ప్రమాణాలు మెరుగుపడగలవని సదస్సు అభిప్రాయపడింది. జిల్లాలోని మారుమూల ప్రాంతాల నుండి కూడా ఉపాధ్యాయులు ఈ సదస్సుకు హాజరైనారు.

సదస్సుకు అధ్యక్షత వహించిన ఉయ్యూరు శాసనసభ్యులు శ్రీ అన్నే బాబూరావు నానాటికీ విద్యాప్రమాణాలు దెబ్బతినటానికి చాలా కారణాలున్నాయని, పబ్లిక్ స్కూళ్ళు, కాన్వెంటుల్లో చదివినవారు అధికశాతం ఉత్తీర్ణులు కావటం మనం గమనిస్తున్నామని ప్రతి ఉపాధ్యాయుడు విద్య గరపటం తన విద్యుక్త ధర్మంగా భావించి రేపటి పౌరులను తయారుచేయాలని హితవు చెప్పారు.

"చిత్తశుద్ధిగల ఉపాధ్యాయులకు తల్లిదండ్రులు కూడా సహకరించాలని" ఆయన కోరారు. జిల్లా విద్యాశాఖాధికారి శ్రీ పి. జాన్ సదస్సును ప్రారంభిస్తూ ఉపాధ్యాయులలో సహనం అవసరమని, విద్యార్థుల ఎడ సామరస్యంతో మెలగాలని, విద్యార్థులు, తల్లిదండ్రులు, ఉపాధ్యాయులు, అధికారులు, విద్యాప్రమాణాలు సాధించటానికి సహకరించాలని అన్నారు. ఉపాధ్యాయుల ట్రాన్స్‌ఫర్‌ల వల్లనే విద్యాప్రమాణాలు తగ్గుతున్నాయనే అపోహలున్నాయని,

**ఉషాకిరణ్**

అది సరికాదని "స్వంత లాభం కొంత మానుకు, పొరుగువానికి తోడుపడవోయ్" అన్న శ్రీ గురజాడ సూక్తి ననుసరించి నియమించిన చోట పనిచేయటం అలవరచుకోవాలని గన్నవరం శాసనసభ్యులు శ్రీ మూల్పూరి బాలకృష్ణ ఉపాధ్యాయులను కోరారు. స్వాతంత్ర్యం సిద్ధించి 38 ఏండ్లు గడిచినా, బానిస విధానాన్ని విద్యార్థులకు అలవాటుచేసే బ్రిటీష్ విద్యా విధానంలో మార్పు రాలేదని, మౌలికమైన మార్పుల ద్వారా ఆ పద్ధతిని మార్చవలసిన అవసరం ఎంతైనా వుందని తెలుగుదేశం పార్టీ కృష్ణాజిల్లా సమన్వయ సంఘం నాయకులు శ్రీ బండి శ్రీమన్నారాయణ అన్నారు, డిగ్రీలు వచ్చినంత త్వరగా ఉద్యోగాలు రావటం సాధ్యంకాదని, క్రింది తరగతుల్లోనే వృత్తి విద్యా విధానం ప్రవేశపెట్టి, సమాజపరంగా విద్యాభివృద్ధికి తోడ్పడే పథకాలను ప్రభుత్వాలు చేపట్టాలని ఆయన సూచించారు.

పదవతరగతి చదివే విద్యార్థి ఇంగ్లీషు అక్షరాలు నేర్చుకొనే స్థితిలో వుంటే విద్యా ప్రమాణాలు మెరుగు కావటం ఎలా సాధ్యమని ప్రముఖ విద్యావేత్త, అష్టా

## చిన్న పత్రికలు మీద చిన్న చూపు

మన రాష్ట్ర ప్రభుత్వం చిన్న పత్రికల మీద చిన్న చూపు చూస్తున్న దనడంలో ఏ మాత్రం అతిశయోక్తి లేదు. 'అతని కంటె ఘనుడు ఆచంట మల్లన్న' అన్నట్లుగా వున్నది తెలుగుదేశం ప్రభుత్వ ప్రస్తుత విధానం. కాంగ్రెసు ప్రభుత్వ హయాంలోనే చిన్న పత్రికలు కొంతవరకు ప్రోత్సహింపబడ్డాయి. గత మూడు నెలల నుండి చిన్న పత్రికలకు ప్రభుత్వ ప్రకటనలు యివ్వడం మానివేసింది తెలుగుదేశ ప్రభుత్వం. 'ఉన్నవాడే ఉన్నవాడిని గౌరవిస్తాడు' అనే నీతిని తెలుగుదేశ ప్రభుత్వం ఆచరిస్తున్నట్లుగా కనబడుతున్నది. పెద్ద పత్రికలకు పెద్ద ఎత్తున ప్రభుత్వ ప్రకటనలు అందుతున్నాయి. చిన్న పత్రికలకు మాత్రం రాష్ట్ర ప్రభుత్వం మొండి చేయి చూపిస్తున్నది. ఈ రాష్ట్ర ప్రభుత్వ చిన్న చూపు విధానం మారాలని, మారకపోతే నిరసనగా భారీఎత్తున ఉద్యమం చేబట్టవలసి వస్తుందని 15-9-1985న సూర్యాపేటలో సమావేశమైన ఆంధ్రప్రదేశ్ తెలుగు చిన్న పత్రికల సంఘం హెచ్చరించింది. చిన్న పత్రికల సంపాదకులు రాష్ట్రవ్యాపితంగా ఆర్.టి.సి. బస్సులలో ప్రయాణించడానికి 'ఫ్రీపాస్' లను యివ్వాలని, నడుస్తున్న పత్రికలకు న్యూస్ ప్రింట్‌ను సప్లయి చేయాలని, సమాచారశాఖ ప్రతి సంచికకు ఒక అడ్వర్టైజ్‌మెంటును తప్పనిసరిగా యివ్వాలని, జిల్లా కలెక్టర్లు తమ అధీనంలోనున్న ప్రభుత్వ ప్రకటనలను స్థానిక చిన్న పత్రికలకు ఇవ్వాలని కోరుతూ సదస్సు తీర్మానించింది. ఈ సదస్సుకు రాష్ట్ర అధ్యక్షులు శ్రీ పోతుకూచి సాంబశివరావు అధ్యక్షత వహించారు. సాయంత్రం జరిగిన బహిరంగసభలో రాష్ట్ర రవాణాశాఖామాత్యులు గౌ॥ శ్రీ కందూడ జానారెడ్డి ప్రభృతులు పాల్గొనినారు. ఈ సమావేశాలు 'తేజో ప్రభ' పక్షపత్రిక ఆధ్వర్యమున నిర్వహించబడ్డాయి

అధ్యక్షులు శ్రీ యార్లగడ్డ రాజగోపాలరావు సూటిగా అడిగారు. ఇందుకుకారణం తల్లిదండ్రులుకాని, ఉపాధ్యాయులు గాని కాదని, ప్రభుత్వ విధానమే కారణమని ఖండితంగా చెప్పారు. ఏడవతరగతికి కామన్, పదవతరగతికి పబ్లిక్ పరీక్షలు నిర్వహించి మిగిలిన తరగతులకు మార్కులతో అవసరం లేకుండా పై తరగతికి ప్రమోటుచేసే "శ్రీ బ్రహ్మానందరెడ్డి విధానం" అమలుజరగటంవల్లనే స్థాయి దిగజారిపోయిందని శ్రీ రాజగోపాలరావు తీవ్రంగా విమర్శించారు. లక్షలాదిమంది భవిష్యతులను తీర్చిదిద్దవలసిన విద్యావిధానాన్ని మార్పుచేసేటప్పుడు ఎవరి సలహా తీసుకున్నారని, ఎవరిని సంప్రదించారని ఆయన ఆవేశంగా ప్రశ్నించారు. రాష్ట్ర ఆదాయం 900 కోట్లు వున్నప్పుడు 180 కోట్లు విద్యకోసం కేటాయించితే, 2,400 కోట్లకు ఆదాయం పెరిగిన తర్వాత 385 కోట్లు కేటాయించితే ఎలా సరిపోతుందన్నారు. దేశంలో నాల్గు మాత్రమే టి.టి.టి.ఐ.లు పనిచేస్తున్నాయంటే మనమెంత వెనుకబడివున్నామో గ్రహించవచ్చని, ఇలాంటి విద్య కొనసాగుతుంటే మనమెలా ముందుకుపోతాం? ప్రమాణాలెలా మెరుగు పరుస్తాం? అని శ్రీ రాజగోపాలరావు ఆవేశంగానే అన్నారు. రాజస్థాన్ హిందీ విద్యాలయ ఉన్నత పాఠశాల ప్రధానోపాధ్యాయులు శ్రీ జె. నాగేశ్వరరావు మాట్లాడుతూ ఆరవ తరగతినుంచి వృత్తివిద్యా కోర్సులు ప్రవేశపెట్టాలని అన్నారు. ఆలోచన లేకుండా టి.యస్.యస్.సి. కోర్సు రద్దు చేయటంవల్ల వృత్తివిద్యలకు ప్రోత్సాహం తగ్గిపోయిందన్నారు చిత్తశుద్ధిగల విద్యార్థులు ప్రభుత్వ నిర్లక్ష్య విధానాలను వ్యతిరేకిస్తారని, అస్సాం, గుజరాత్ సంఘటనలు అందుకు నిదర్శనమని శ్రీ నాగేశ్వరరావు వివరించారు.

తప్పుచేసిన కొడుకును (విద్యార్థి) విడిపించమని యస్.పి.కి ఫోనుచేసే తల్లిదండ్రులున్న ఈ సమాజంలో, విద్యార్థివద్ద అగ్గిపెట్టె తీసుకుని సిగిరెట్టు అంటించుకునే "అధ్యాపకు" లున్న వాతావరణంలో విద్యాప్రమాణాలు పెంచటానికి అవకాశం వుందా? అని "శ్రీవాణి" పత్రిక సంపాదకులు శ్రీ కొమరగిరి కృష్ణమోహనరావు

అడిగారు. జాతీయతా భావన పెంచి ధీరోదాత్తులను తయారు చేయాల్సిన వీరమాతలు డిటెక్టివ్, సెక్స్ సాహిత్యాలు చదువుతూ కాలక్షేపం చేస్తుంటే, ఉద్యోగాల పేరిట పసి పిల్లలను ఆయాలమీద వదలి నిర్లక్ష్యం చేస్తుంటే, భావి పౌరులెలాగు తయారవుతారు! అని మహిళాలోకానికి చురకలు అంటించారు. సమాజశ్రేయస్సు కోసం, కిరాతకుడైన కన్నకొడుకునే చంపటానికి ఆయుధాన్ని తయారు చేసిన విశ్వకర్మలా ప్రతి తండ్రి తయారుకావాలి. విద్యార్థులలో నైతిక శీలసంపద కొరవడింది. నాయకులు; ఉపాధ్యాయులు తమ స్వార్థప్రయోజనాలకు వాడుకోవటంవల్ల విద్యాప్రమాణాలు అడుగంటిపోయాయి. చివరకు బలైపోయింది మాత్రం విద్యార్థులే. ఇందుకు అందరూ కారకులే. పాలకపక్షము, ప్రభుత్వము 38 సంవత్సరాలుగా విద్యాప్రమాణాలు మెరుగుపరచుకో లేకపోయాయంటే మనం తిరోగమనంలో వున్నామనే అనవచ్చన్నారు శ్రీ కొమరగిరి తన సుదీర్ఘ ప్రసంగంలో. ప్రభుత్వ విధానాలు అమలు జరగకపోవటానికి అధికారులే పూర్తిగా కారకులుకాదని, అన్ని రంగాలనుంచి సహకారం అవసరమని, విద్యార్థుల కోర్కెపైనే విద్యావిధానాలు మార్చవలసి వస్తుందని జిల్లా పరిషత్ విద్యాశాఖాధికారి శ్రీ యల్. శ్రీరామ్మూర్తి అన్నారు. ఆశయాలకు అవసరమైన వనరుల సమీకరణ జరగకపోవటంవల్ల కూడా పథకాలు అమలు జరగటంలో ఆలశ్యం జరగటం, అసలు ప్రవేశపెట్టకుండా కూడా వదలివేయటం జరుగుతుందన్నారు. సంఘాలు ప్రమాణాలు పెంచటానికి దోహదపడాలని, ప్రయివేట్లు రద్దుచేయాలని ఉత్తర్వులు పంపినంత మాత్రాన అవి ఆగిపోవని, ఉపాధ్యాయ సంఘాలే వాటిని అరికట్టటానికి పూనుకోవాలని శ్రీ రామ్మూర్తి విన్నపం చేశారు.

కృష్ణాజిల్లా అన్ని రంగాలలోను ముందుంటుందని వ్యవసాయ విద్యారంగాల్లో వెనుకబడివుండటం ఆశ్చర్యంగా వుందని, విద్యాప్రమాణాలు మెరుగుపడటానికి ఉపాధ్యాయులు కృషిచేయాలని, అవసరమైన సూచనలు చేయాలని, జిల్లా పరిషత్ ఛైర్మన్ శ్రీ సుంకర సత్యనారాయణ

## సూత్రప్రాయంగా

చేదు నిజం మింగుతూ
మంటల్లో మగ్గుతూ
లేని మానవత్వం కోసం
దేవులాడుతూ
కళ్ళల్లో చైతన్యపు
వత్తులు వేసుకుని
నిరీక్షించే అల్ప బుద్ధీ!
నువ్వు కలం పట్టి
కవిత్వం కుప్పించినా
విప్లవం పేరు చెప్పి
పిడికిలి బిగించినా
ఈ లోకం పోకడ మాత్రం
తెగిపోయిన మంగళసూత్రం.

— మంతెన సూర్యనారాయణరాజు

కోరారు. క్రమశిక్షణ గరవటంలోను, ఉత్తీర్ణత శాతం పెరగటంలోను ఉపాధ్యాయులు తమవంతు పాత్రను పటిష్ఠంగా నెరవేర్చాలన్నారు. ఏ విషయంలో చూసుకున్నా రాసి ప్రత్యేకత కాకుండా, వాసి ప్రధానం కావాలన్నారు. పరిష్కారం కాని విషయాలు ఎన్నో వుంటాయని, వాటిని తమ దృష్టికి, అధికారుల దృష్టికి తెస్తే చర్యలు తీసుకోగలమని అంటూ బదిలీల విషయంలో మాత్రం వత్తిడి తేవద్దని ఆయన మనవి చేశారు.

సంఘం వ్యక్తి ప్రయోజనాలను దృష్టిలో వుంచుకోకుండా సంఘ ప్రయోజనాలకోసమే పనిచేయాలని హితవు చెప్పారు తెలుగునాడు అధ్యాపక సంఘం ప్రధాన కార్యదర్శి శ్రీ ముసునూరి నారాయణరావు వందన సమర్పణ చేసారు. తెలుగునాడు అధ్యాపక సంఘ అధ్యక్షులు శ్రీ పి. వి. కృష్ణారావు ప్రారంభంలో స్వాగతం పలికారు. 

అకాడమీల రద్దు కళలకు గ్రహణమా?... చర్చావేదిక

# అకాడెమీల రద్దు.... తర్వా ??

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఒక్క కలం పోటుతో రాష్ట్రంలోని సాహిత్య, సాంస్కృతిక అకాడమీల నన్నింటినీ రద్దు పరిచింది. అకాడమీల్ని రద్దు చేయబోయే ముందు, రద్దు పూర్వాపరాలు ఆలోచించాలనీ, తొందరపాటు నిర్ణయం తగదనీ ఎంతోమంది సుప్రసిద్ధ కళాకారులు; సాహితీవేత్తలు, రాజకీయనాయకులు ప్రభుత్వానికి చేసిన విజ్ఞప్తులన్నీ చెవిటి వాని ముందు శంఖం వూదిన చందాన వృథా అయ్యాయి. సహకారసంఘాల నియమావళి క్రింద రిజిష్టర్ చేయబడిన కొన్ని అకాడమీల్ని రద్దు పరచే అధికారం లేని ప్రభుత్వం, ఇందు కోసం ప్రత్యేకించి రెండు ఆర్డినెన్సులను జారీ చేసి, శాసనసభలో తనకున్న బలాధిక్యతతో బిల్లును ప్రవేశపెట్టి శాసనాన్ని సవరించింది. తద్వారా అధికారాన్ని సంక్రమింపజేసుకుంది.

గుత్తికొండ సుబ్బారావు

కీ॥ శే॥ నార్ల వెంకటేశ్వరరావు పత్రికా ప్రపంచంలో ప్రముఖుడు. సాహిత్య ప్రపంచంలో కూడ తనదైన ప్రత్యేకతను సంతరించుకున్న ప్రజ్ఞాశాలి. అయితే ఆయనకు సంస్థల నిర్మాణం, నిర్వహణ విషయాల్లో వున్న పరిచయం పూజ్యం. తనకు ఎప్పటినుంచో అకాడమీల అధినేతల్తో వున్న పాత పగల్ని దృష్టిలో వుంచుకుని, దురుద్దేశాల్ని ముందే వూహించుకుని తొందరపడి ఒక "సలహా" పారేశారు ప్రభుత్వానికి. అయితే నార్ల నివేదికపై ఎన్నో తర్జన భర్జనలు జరిగాయి. ఎంతోమంది ఈ నివేదికను వ్యతిరేకించారు. అయినా ప్రభుత్వం తను పట్టిన కుందేలుకు మూడే కాళ్ళు అన్నట్లు వ్యవహరించింది. అకాడమీలు రద్దయ్యాయి అర్ధాంతరంగా.

అసలైన సమస్య యిక్కడే మొదలయింది. "తెలుగు విజ్ఞాన పీఠా"న్ని స్థాపించారు ప్రభుత్వంవారు. గడచిన రెండేళ్ళుగా తెలుగు విజ్ఞాన పీఠం ప్రగతి ఏమిటో ఎవరికీ తెలియదు. చివరికి దాని పాలనాధికారి ఆచార్య తూమాటి దోణప్పగారికైనా పీఠం యొక్క పూర్తి వివరాలు తెలుసో లేదో తెలియదు. అంతా అయోమయంగా తయారైంది. తెలుగుదేశం ప్రభుత్వం ఏ సమస్యను కెలికినా అది కంపు కొడుతూనే వుంది. ఇందుకు ప్రస్తుతం రాష్ట్ర ప్రభుత్వం ఎదుర్కొంటున్న ఎన్నో సమస్యలే సాక్షిగా నిలుస్తాయి. దాదాపు 7, 8 అకాడమీలు ఆయా రంగాలలో ఎంతో నిష్ణాతులైన పెద్దల ఆధ్వర్యంలో కళల ప్రగతికి శ్రమిస్తుంటేనే సరిగా సాగని కళాపోషణను, కేవలం ఒకే ఒక పీఠంలో కేంద్రీకరించి సాగించాలనుకోవటం ఒట్టి తెలివి తక్కువతనం. రద్దు చేయబడిన అకాడమీల కార్యనిర్వహణలో లోటుపాట్లు లేవని నేను అనను - అయితే ఇంట్లో దూరిన ఎలుకను చాకచక్యంగా పట్టి పారేయాలి కాని, ఇంటినే తగులబెట్టుకోవడం తెలివిగలవారు చేయదగ్గ పని కాదు.

గడిచిన రెండేళ్ళుగా రాష్ట్రంలో కళలకు గ్రహణం పట్టిదనే చెప్పాలి. ప్రభుత్వ ఆధ్వర్యంలో అప్పుడప్పుడు జరిగే కళామేళాల భాగోతం అందరికీ తెలిసిందే.

ప్రభుత్వం యిప్పటికైనా కళ్ళు తెరచి కనీసం తెలుగు విజ్ఞానపీఠం కార్యక్రమాలకు ఒక సక్రమమైన పద్ధతిని రూపొందించి, వివిధ రంగాలలోని ప్రముఖుల్ని విజ్ఞాన పీఠం నిర్వహణలో భాగస్వాముల్ని చేసి, తద్వారా తను చేజేతులా చేసిన తప్పిదాన్ని సరిదిద్దుకోవాలి. ముఖ్యంగా అర్ధాంతరంగా ఆగిపోయిన సాహిత్య అకాడమీ ప్రాజెక్టు

(తరువాయి 52వ పేజీలో)

# సమిష్టి సముష్టి వ్యాపారం

" వీధిలో కరవాల ధారుడు
ఆ. పైన ఉత్తరాల బాహుడు
హోటల్లో సర్వరుడు
ఆఫీసులో ప్యూవుడు
అంతా ఎంచక్కా
నమస్కారాల్ గొట్టి
ఉబ్బించి
బయటపెడతారు ఓ చందాల చీటీ "

కాలచక్రం మామూలే! దాని భ్రమణం మామూలే! ఇది ప్రత్యేకించి మామూళ్ళ కాలం. ఎక్కడా తప్పించుకోలేని విధంగా పదిమంది పండగ మామూళ్ళ కోసం మిమ్మల్ని "హేండ్సప్" చేస్తారు. చేతులెత్తి మొక్కుతారు. లేనిపోని మమకారం, అనురాగం ఒకటేమిటి? ఎన్ని ఒలకబోయచ్చో అన్నీ ఒలకబోస్తారు. అయినా మీరు పొగడ్తలకు లొంగరు. ఇదంతా మామూళ్లే అవి మీకు తెలుసు – మామూలుకోసం అనీ తెలుసు. అయినా మీరు తప్పించుకోలేరు....

" వాళ్ళాయనకి జీతం తక్కువే! అయినా పై మామూళ్లుంటాయ్ " అని చెప్పుకోబడేవాడు, కొండొకచో కొనియాడ బడేవాడు ఈ రోజుల్లో గొప్పవాడు. కొన్ని డిపార్టుమెంటలో ఉద్యోగాలు మూడు మామూళు ఆరు చందాలుగా మాంచి పవర్‌ఫుల్‌గా ఉంటాయి. అదిగాక బోనస్ లాగా దసరాకి వాళ్ళకివ్వాల్సినంత మామూలు వాళ్ళు ప్రకటించుకొంటారు. వాళ్ళల్లో వాళ్ళంతా మామూళ్ల మాసం సమీపిస్తుండగా సమావేశమై చర్చించుకొని – చర్చించుకొంటూ తిట్టుకొని, తిట్టుకొంటూ కొట్టుకోబోయి మరీ కొట్టుకుంటే జనం దృష్టిలో తేలికై పోతామని రాజీకొచ్చి కలిసి ఉంటే కలదు మామూలు అనుకొని ఆఖరిగా ఓ పాట పాడతారు. పాట అంటే ఏ సమైక్యతా గీతమో, జాతీయగీతమో అనుకునేరు. వేలంపాట పాడతారు. ఈయేడు ఎంత మొత్తం మామూలు వసూలైయ్యాలో వసూలైయ్యడానికి ముందుకొచ్చే పహిల్మాన్‌గారెవరో పాటలో గెలుస్తారు. పాట పాడిన పహిల్మాన్‌గారు వసూళ్ళ భారం వారి భుజ స్కంధాలమీద వేసుకొంటారు. ఇక జనం మీద పడి వసూలెస్తారు. పాడిందానికంటే ఎక్కువ వసూళ్ళు చేస్తేనే అతగాడికి లాభం. " అసలీయేడు నా కిష్టంలేదు. పోయినేడాది వసూళ్ళు సరిగా కాక నష్టం వచ్చింది. దాన్ని పూడ్చుకోడానికేగాని ఈ యేడాది నా కిష్టంలేదు " అంటూ ప్రారంభిస్తాడు అలా అలా... మీ దగ్గరదాకావస్తాడు....




ఓ సారి ఓ భార్యామణి " అందరికీ మామూలిస్తున్నారు నాకేది? " అని మొగుణ్ణి ప్రశ్నించింది. " నువ్వు మామూలడిగే మామూలు పని మనిషి స్థాయికి దిగిపోవడం నాకే మాత్రం ఇష్టంలేద"న్నాడు శ్రీమాన్ భర్త తప్పించుకోడానికి – అయినా ఫర్వాలేదంది మామూలుకంటే ఎక్కువ వయ్యారం ఒలకబోస్తూ – అలా అయితే ఇంతకంటే మంచి మంచి పని మనుషులే దొరుకుతారు మామూళ్ళిస్తే అని జవాబిచ్చాడు సరసానికి పోతూ – అంతే బల్బులు మాడిపోయాయ్! సరసం కాస్త విరసమై కూర్చుంది. అంత ఒయ్యారం అలకై అబ్బాయిగార్ని హడావుడి చేసింది. చివరికి అతగాడు మామూలుగా యిచ్చే మామూళ్ళతోనే దగ్గరవాల్సి వచ్చింది శ్రీకృష్ణుడిలాగా –

ఇలా ఇంటా బయటా గొడవలై పోతున్నాయని ఎక్కడికైనా పారిపోదామనుకుంటున్నారా? అలా వీల్లేదంటే వీల్లేదు. అలా పారిపోయినాయన్ని గురించి "కనబడుటలేదు" అంటూ డాక్టర్ తంబుగారిచ్చిన ప్రకటన ఉన్నదున్నట్టు ప్రక్క పేజీలో మీ ముందుంచి నే తప్పుకొంటున్నాను. ఆ తరువాత మీ ఇష్టం ....

# కనబడుటలేదు

నాయనా! చంద్రశేఖరం! దసరా మామూలు వాళ్ళకు భయపడి నువ్వు పారిపోయిన నాటినుంచీ, నీ కోసం నీ భార్యాపిల్లలూ, మరియు, దసరా మామూలు వాళ్ళూ,, బెంగ పెట్టుకుని మంచం పట్టారు. ముక్కూ మొహం తెలియని అడ్డమయిన వాళ్ళూ వచ్చి, వాళ్ళకు నువ్వేదో అచ్చున్నట్లు అడుక్కుతింటూ ఉంటే, కిందటి జన్మలో నువ్వు చేసిన అప్పులు, సులభవాయిదా పద్ధతిలో దసరా మామూళ్ళ పేరిట చెల్లిస్తున్నాను అనుకోవాలి. అంతేకాని అలా భయపడి పారిపోతే ఎలా?

అసలు అడుక్కోవడం, ధర్మం చేయడం అనేవి మన సంప్రదాయం మరియు సంస్కృతీ- అందులో దసరా మామూలు అనేది ఎన్నో ఏళ్లుగా వస్తున్న ఆనవాయితీ.

అన్నట్టు ఎక్కడపడితే అక్కడ ప్రత్యక్షమయ్యే ఈ దసరా మామూలు దేవతలనుంచి నువ్వు తప్పించుకోలేవు. నువ్వు ఎన్ని మారువేషాలు వేసుకుని తిరిగినా, ఎక్కడో ఏదో డిపార్టుమెంటు పేరిట నిన్ను వాళ్ళు వెంటాడి మామూలు వసూలు చెయ్యక మానరు.

ఎన్ని యుద్ధాలు జరిగినా, ఎన్ని ఎమర్జెన్సీలు వచ్చినా, ఎన్ని ప్రభుత్వాలు మారినా ఈ దసరా మామూలు వ్యవస్థని మాత్రం ఎవ్వరూ మార్చలేరు. ఇదొక సమిష్టి సమ ముష్టి వ్యాపారం. అనేక డిపార్టుమెంటుల పేరిట విశ్వరూపం ధరించిన ఈ దసరా మామూలు తప్పించుకోలేవు.

కాబట్టి నువ్వు అర్జంటుగా తిరిగివచ్చి చెంబూ, తపేళా తాకట్టుపెట్టి దసరా మామూలు వాళ్ళను, ఈ యేడాదికి వదిలించుకో. కనీసం వచ్చే ఏడాది ఈ బాధ తప్పాలని ప్రభుత్వాన్నీ, ప్రజల్నీ ప్రార్థిస్తూ... ప్రేమతో-

— నీ తంబు

(ఆంధ్రజ్యోతి వారపత్రిక సౌజన్యంతో.)



## అకాడెమీల రద్దు... (50వ పేజీ తరువాయి)

లయిన వృత్తిపదకోశనిర్మాణం, సమగ్రాంధ్ర నిఘంటువు తయారీ, ఆధునిక సాహిత్య ప్రక్రియలకు ప్రోత్సాహక బహుమతుల పునరుద్ధరణ, వివిధ సాహిత్య ప్రక్రియల్లో పుస్తక ప్రచురణకు ఆర్థిక సహాయాలు, సంస్థలకు తమ కార్యక్రమాల నిర్వహణకు అందించే గ్రాంటుల పునరుద్ధరణ వగైరాలను చేపట్టాలి. ఇలాగే మిగతా లలిత కళలైన సంగీత, నృత్య, నాటక, చిత్రకళల రంగాల్లోనూ తగినంత వేగంగా నిర్ణయాలు తీసుకుని అమలు పరచాలి.

చివరగా ఒక మాట. ఉన్న యింటిని పడగొట్టడం చాలా తేలిక — కొత్తది కట్టుకోవడం చాలా కష్టం. కొత్తది కట్టుకోవడం పూర్తయ్యాకనే ఉన్న యింటిని పడగొట్టాలి — లేకుంటే వీధి పాలవుతాం. ప్రస్తుత పరిస్థితి ఇందుకు ఏ మాత్రం భిన్నంగా లేదు. అదే విచారించాల్సిన విషయం. ఒక కళాకారుని పరిపాలనలో కళలకు గ్రహణం పట్టిందనే అపకీర్తి మన ముఖ్యమంత్రి మీద పడరాదని ఆశిద్దాం.



# వా పోషకులు



నూతన వధూవరులు

శ్రీ కొల్లిపర రాజశేఖర్

శ్రీమతి కొల్లిపర రాజరాజేశ్వరి

విజయవాడ



శ్రీ చింతపల్లి అచ్చయ్య

హైదరాబాదు